# నా అనుభవాలు

స్వామి పరమానందనాథ

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.
ఆస్థాన విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత,
గండపెండేర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ,
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద
డా॥ క్రోవి పార్థసారథి

ప్రకాశకులు :

డా॥ క్రోవి పార్థసారథి

23-11/1-10/2, ఓగిరాల వారి వీధి, సత్యనారాయణపురం,
విజయవాడ-520 011. సెల్ : 9866820574

**నా అనుభవాలు**

**స్వామి పరమానందనాథ**

ప్రథమ ముద్రణ : మే, 2019

ప్రతులు : 1000



వెల : అమూల్యము

ప్రతులకు :

**క్రోవి పార్థసారథి**
23-11/1-10/2,
ఓగిరాల వారి వీధి,
సత్యనారాయణపురం,
విజయవాడ -520 011.
సెల్ : 9866820574

# దివ్య స్మృతి



క్రోవి పార్థసారథి గారి సతీమణి

కీ॥శే॥ శ్రీమతి క్రోవి రమాదేవి గారు

జననం : 25-10-1952 మరణం : 12-01-2014



డా॥ క్రోవి పార్థసారథి గారిని మైసూర్ దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియమిస్తున్న పూజ్యశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ, గుజరాత్ రాష్ట్ర గవర్నర్ గౌ॥ శ్రీ నావల్ కిషోర్ శర్మ, కర్నాటక రాష్ట్ర గవర్నర్ గౌ॥ శ్రీ టి.ఎన్. చతుర్వేది, 29-5-2005




మాత కరుణామయి ఆధ్వర్యంలో ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.

ఆస్థాన విద్వాంసులుగా డా॥ క్రోవి పార్థసారథి గారి నియామకము



**శరన్నవరాత్రుల సందర్భముగా 9-10-2016న**
**ఘంటసాల సంగీత కళాశాలలో డా॥ క్రోవి పార్థసారథి గారిని**
**యం.ఎల్.ఎ. బొండా ఉమ గారు, తదితరులు సత్కరించినారు**




**హేవిళంబి నామ సంవత్సర ఉగాది సందర్భంగా 29-4-2017న**
**డా॥ క్రోవి పార్థసారథి గారిని విశిష్ట పురస్కారంతో సత్కరిస్తున్న మాజీ శాసనసభ్యులు**
**శ్రీమల్లాది విష్ణు, డా॥ ఈశ్వర్, డా॥ చల్లా హరికుమార్ ప్రభృతులు**




**21-3-2004న డా॥ క్రోవి పార్ధసారథి గారికి రాష్ట్రప్రభుత్వముచే**
**తారణనామ సంవత్సర ఉగాది పురస్కారము**



**5-9-2004న డా॥ క్రోవి పార్ధసారథి గారిని రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయునిగా**
**సత్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి గారు**



**24-12-2017న సహస్ర చండీ యాగానికి పూర్ణాహుతి**

**చేస్తున్న స్వామి పరమానంద నాధులు**



**గుంటూరు శ్రీశృంగేరీ విరూపాక్ష పీఠాధిపతులు**

**శ్రీ.శ్రీ.శ్రీ గంభీరానంద భారతీ వారిచే అష్టావక్రగీత గ్రంథావిష్కరణ**

# విషయసూచిక

# 1. నా అనుభవాలు

మీరు ఇన్ని పుస్తకాలు ఎలా వ్రాస్తున్నారు? మీరు వ్రాసినవి అన్నీ పెద్ద పుస్తకాలే. కేవలము పేజీల సంఖ్యే కాదు. వాటిలో విషయం కూడా చాలా గొప్పది. మీరు వ్రాసిన వాటిలో **ఎక్కువ పుస్తకాలు** అమ్మవారికి అంటే **శ్రీవిద్యకు సంబంధించినవే.** శ్రీవిద్య జోలికి వెళ్ళినవాడు, శ్రీచక్రాన్ని అర్చించిన వాడు నాశనమై పోతాడు అని ప్రజానీకంలో ఒక భయం ఉండేది. అందుచేత లలితా సహస్రం పారాయణ చెయ్యాలన్నా భయపడే రోజులు వచ్చాయి. ఆ సమయంలో శ్రీవిద్యకు సంబంధించిన పుస్తకాలు మీరు వ్రాయటం, వాటిని **శివకామేశ్వరి గ్రంథమాల,** కృష్ణలంక, విజయవాడ. వారు ప్రచురించటం జరిగింది. అప్పటి నుంచి మిగిలిన వారు కూడా లలితా సహస్రము, సౌందర్యలహరి, కామకలావిలాసము, సుభగోదయ స్తుతి, వరివస్యా రహస్యము, శ్రీవిద్య, దేవీ పూజావిధానము వంటి పుస్తకాలు వ్రాయటం జరిగింది. దాంతో శ్రీవిద్యకు విశేషమైన ప్రచారం లభించింది. ఇప్పుడు స్త్రీలు సంఘాలుగా, మండలిగా ఏర్పడి లలితాసహస్రం పారాయణ చేస్తున్నారు. శ్రీవిద్య అంటే తెలిసినా, తెలియకపోయినా శ్రీవిద్య అంటే భయం మాత్రం పోయింది. దీనికి కారణం చాలా వరకు మీరే అని చెప్పాలి.

ఇంకొక ముఖ్యమైన విషయం ఏమంటే **చతుర్వేద భాష్యము** అనే పేరుతో నాలుగు వేదాలలోను ఉన్న ముఖ్యమైన విషయాలు సులభశైలిలో ప్రచురించారు. అన్నింటికీ మించి **బ్రహ్మసూత్ర భాష్యము.** శంకర భగవత్పాదులను అనుసరించి మీరు వ్రాసిన భాష్యం. ఆ తరువాత శ్రీవిద్యలో ప్రతిపాదించిన పరమేశ్వరియే పరబ్రహ్మ స్వరూపము అంటూ **శ్రీవిద్యాపరంగా బ్రహ్మసూత్ర భాష్యము** వ్రాశారు. ఇది అనితర సాధ్యమైనది. ఇటీవల మీరు వ్రాసిన **బ్రహ్మసత్యం–జగన్మిథ్యా** (అద్వైతసారము) పుస్తకం **మీరు వ్రాసిన 48 పుస్తకాలలోను, మకుటాయమానమైనది** అని పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు శ్రీగరిమెళ్ళ సోమయాజులు గారు తమ పీఠికలో వ్రాశారు.

శ్రీవిద్యలో ప్రముఖమైన పుస్తకాలు ఆరు.

1. గౌడపాదుల వారి సుభగోదయ స్తుతి
2. పుణ్యానంద మునీంద్రుల కామకలావిలాసము
3. యోగినీ హృదయము
4. వామకేశ్వర తంత్రము
5. శంకర భగవత్పాదులు వ్రాసిన సౌందర్యలహరి
6. బ్రహ్మాండ పురాణంలోని లలితా సహస్రము

వీటిలో వామకేశ్వర తంత్రం తప్ప మిగిలిన అన్ని పుస్తకాలకు మీరు తెలుగులో వ్యాఖ్య వ్రాశారు. **శ్రీవిద్య** అనే పేరుతో శ్రీవిద్య మీద విపులంగా గ్రంథం వ్రాశారు. ఇవి గాక భాస్కరరాయలవారు వ్రాసిన **వరివస్యా రహస్యాని**కి తేటతెలుగులో వ్యాఖ్య వ్రాశారు. శ్రీవిద్యాపరంగా ఇన్ని గ్రంథాలు వ్రాసిన వారు ఇంకొకరు లేరు అని పండితులు, శ్రీవిద్యాపరులు చెబుతున్నారు. అటువంటి సమయంలో **వామకేశ్వర తంత్రాన్ని** మీరు తెలుగులో ఎందుకు వ్రాయలేదు?

అసలు ఇన్ని గొప్ప గొప్ప పుస్తకాలు మీరు ఏ విధంగా వ్రాయగలిగారు? తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. దయ చేసి తెలియజేయండి"

ఇది ఒక మిత్రుడు అడిగిన ప్రశ్న. దరిదాపుగా ఇదే ప్రశ్నను నేను వెళ్ళిన ప్రతిచోట అడుగుతున్నారు. అంత మందికీ విషయాన్ని కూలంకుషంగా వివరించలేను కాబట్టి చెప్పదలచుకున్నదంతా నాలుగు మాటల్లో పొందు పరుస్తున్నాను.

నేను హరితస గోత్రీకుణ్ణి అని తెలిసిన చాలామంది మీరు ఎక్కడి వారు? మాది కూడా అదే గోత్రం. మీ వివరాలు చెప్పండి అని అడిగేవారు. దానికి సమాధానంగా **శ్రీవిద్యాసారథి** (లలితా సహస్రనామ భాష్యం)లో మా వంశవృక్షం ఇచ్చేశాను. అప్పటి నుంచి ముఖ్యమైన పుస్తకాలలో వంశవృక్షం కనిపిస్తోంది. ఇప్పుడు ఉత్తరాలు రావటం మానేశాయి. అలాగే మీ అనుమానాలు తీర్చటం కోసం నా గ్రంథ రచన ఎలా సాగింది? దీనికి బీజం ఎప్పుడు, ఎక్కడ, ఎలా పడింది? అనే విషయాలు ఇక్కడ వివరిస్తున్నాను. అంతేకాదు శ్రీవిద్య మీద పుస్తకాలు అసలు ఎందుకు వ్రాయవలసి వచ్చింది? అనే ముఖ్యమైన విషయాన్ని కూడా ఇక్కడ

వివరిస్తాను. నా భార్య రమాదేవి ఎప్పుడూ అంటూ ఉండేది "ఆటో బయోగ్రఫీ' వ్రాయటానికి సరిపోయే విషయం మీ దగ్గరుంది. అది మాకెవరికీ లేదు. కాబట్టి మీరు ఆ విషయమంతా ఒక చిన్న పుస్తకంగా వెలువరించండి" అని. అప్పట్లో నేను నవ్వి ఊరుకునేవాణ్ణి. నిన్నటి రోజున ఉన్నట్టుండి నేను ఈ పుస్తకాలు వ్రాయటానికి ఎంత కష్టపడ్డాను? ఇందులో నాకు సహకరించిన వారెవరు? అసలు ఈ పుస్తకాలు వ్రాయాలనే ఆలోచన ఎలా వచ్చింది? అది ఎలా సఫలీకృతం అయింది? గ్రంథ ముద్రణ ఎలా జరిగింది? అన్నింటికీ మించి నా అనుభవాలు మొదలైన అనేక విషయాలు మీ ముందుకు తీసుకురావాలనిపించింది. నా భార్య కోరిక ఇవాల్టికైనా తీరుతోందని ఆనందిస్తూ ఆ విషయాలు మీ ముందుకు తేవటానికి ప్రయత్నిస్తున్నాను.

## ౨. మొదటి గురువు

నా చిన్నతనంలో మేమున్నది బందరు ఖొజ్జిల్లి పేటలోని కృత్తివెంట వారి అగ్రహారంలో అని గతంలో చెప్పాను. అగ్రహారంలో ఉండేది అందరూ బ్రాహ్మణులే. అయితే మా ఇంటి ప్రక్కన తూర్పువైపున డబ్బై గజాల స్థలంలో ఒకావిడ ఉండేది. ఆవిడ పేరు **'రామాను సుబ్బమ్మ'** జన్మతః ఈవిడ పల్లెకారి. సముద్రం దగ్గర 'గిలకల దిండి' స్వంతఊరు. ఇంటి పరిస్థితుల వల్ల చిన్నప్పుడే ఇంట్లో నుంచి గెంటి వేయబడి బందరు చేరి ఈ అగ్రహారంలో డబ్బై గజాల స్థలం, అందులో చిన్న ఇల్లు సంపాదించింది. ఈవిడకు ఇద్దరు ఆడపిల్లలు. 1.సీతారావమ్మ 2. సీతారామానుజమ్మ. రెండవ కుమార్తె సీతారామానుజమ్మతో కలిసి ఇక్కడే ఉండేది సుబ్బమ్మ. నాకు తెలిసేప్పటికే ఈవిడకు డబ్బై సంవత్సరాలున్నాయి. ఈవిడ కృష్ణ భక్తురాలు. కుమార్తె స్కూలు టీచరు. ఉదయం ఏడు గం॥ కల్లా స్కూలుకు వెళ్ళిపోయేది. ఆ తరువాత ఇంట్లో పని అంతా చేసుకుని, పదకొండు గంటలకు పూజకు కూర్చునేది సుబ్బమ్మ. పూజ, జపం పూర్తయ్యేసరికి ఒంటిగంట అయ్యేది. ప్రతిరోజు తప్పనిసరిగా దేవాలయంలో పురాణం వినటానికి వెళ్ళి, రాత్రి ఎనిమిది గంటలకు మా ఇంటికి వచ్చి ఆ రోజు చెప్పిన విషయమంతా మా అమ్మకు చెప్పి వెళ్ళేది. ఆవిడ రాగానే మేం కూడా

పుస్తకాలు మూసేసి ఆవిడ దగ్గర చేరి కథలు వింటుండే వాళ్ళం. రామాయణ, భారత, భాగవతాలన్నీ నా చిన్నతనంలో, సుబ్బమ్మ చెప్పగా విన్నవే. సాయంత్రం ఆరు గంటలదాకా వాకిట్లో అరుగుల మీద కూచుని అందరితోను కబుర్లు చెబుతుండేది. ఒకసారి సుబ్బమ్మతో సహా ఆడవాళ్ళందరూ కబురు చెప్పుకుంటున్నారు. పిల్లలందరూ ఆడుతూ అల్లరి చేస్తున్నారు. అప్పుడు నేను నాల్గవ క్లాసు చదువుతున్నాను అంటే నాకు ఎనిమిది సంవత్సరాలు. సుబ్బమ్మ ఒకరోజు సాయంత్రం నన్ను చూసి 'బుజ్జీ ! ఎందుకలా అల్లరి చేస్తావు?' అంది.

'నేను అల్లరి ఎక్కడ చేశాను? ఆడుకుంటున్నాను' అన్నాను.

'అలా కాదు కాని **'ఓం నమశ్శివాయ'** అంటూ జపం చెయ్యి' అంది.

'నేను ఆడుకోవాలి' అన్నాను.

'ఆడుకుంటూనే చెయ్యి. నువ్వు ఆడుకుంటూనే ఓం నమశ్శివాయ అంటూ ఉండు. నువ్వు ఏ పని చేస్తున్నా సరే ఓం నమశ్శివాయ అంటూనే ఉండు.' అని చెప్పింది. ఆ మాటలు నా మనసులో పాతుకుపోయినాయి. అప్పటి నుంచి ఆడుకుంటున్నా, తింటున్నా, తిరుగుతున్నా ఒకటే నామస్మరణ 'ఓం నమశ్శివాయ' ఈ మధ్యలో సిమెంటుతో కాని, ఇసకతో కాని శివలింగం చెయ్యటం, పూజ చెయ్యటం, నామస్మరణ. ఇలా సంవత్సరాల పైగా నడిచింది. ఇంకొక విషయం ఏదీ తెలియదు. ఓం నమశ్శివాయ పగలు, రాత్రి తేడా లేకుండా జపం చెయ్యటమే ముఖ్యమైన పని, ఇలా జపం ఎన్ని కోట్లు అయిందో లెక్కలేదు. ఈ రకంగా రామాను సుబ్బమ్మ **నా మొదటి గురువు** అయింది.

## 3. రెండవ గురువు

మా స్వగ్రామం 'బందరు'. కృష్ణాజిల్లాకి ముఖ్య పట్టణం. స్వతంత్రం రాకముందు ఫ్రెంచివారు, డచ్చివారు, ఆంగ్లేయులు. అందరూ దీన్ని పాలించారు.. ఇప్పటికి కూడా పరాసుపేట (ఫ్రెంచివారు పాలించినది) బచ్చుటపేట (డచ్చివారి అధీనంలో ఉన్నది) ఇంగ్లీషుపాలెం (ఆంగ్లేయుల అధికారంలో ఉన్నది) ఆ పేర్లతోనే

పిలవబడుతున్నాయి. మేము ఉన్న ప్రదేశం కృత్తివెంటి వారి అగ్రహారం. మా సందులో మాది చాలా పెద్ద స్థలం. 960 గజాల స్థలంలో ఇల్లు మా ఇంటికి తూర్పు వైపున రెండిళ్ళ అవతల ఉండేవారు **కంభంపాటి రామ్మూర్తి శాస్త్రి** గారు. మా పూర్వీకులు మా ఇంటిని 1865లో కొన్నారు. అప్పటి నుంచి ఇప్పటిదాకా మా అధీనంలోనే ఉంది? శాస్త్రి గారు వ్యాకరణ పండితులు. ప్రక్కవీధిలోనే కుప్పా ఆంజనేయ శాస్త్రి గారు ఉండేవారు. వీరు బందరు హిందూ కాలేజీలో తెలుగు లెక్చరరుగా పనిచేశారు. వీరి తమ్ముడు కుప్పా లక్ష్మణావధానిగారు వేదపండితులు. లక్ష్మణావధాని గారి కుమారుడు కృష్ణమూర్తి గారు. వీరిని ఆంజనేయశాస్త్రి గారు దత్తు తీసుకున్నారు. ఆయనే కుప్పా కృష్ణమూర్తి గారు. గణపతి సచ్చిదానంద స్వామివారి ఆశ్రమానికి విద్యాధికారి. మా యింటికి దగ్గరలోనే నాగేశ్వరస్వామి వారి దేవాలయం ఉంది. అవుటపల్లి హనుమంతరావు గారు ఆ ఆలయానికి ధర్మకర్త. ఆ దేవాలయంలో ప్రతిరోజు సాయంత్రం 6 గం॥ నుంచి 7 గం॥ వరకు భజన, 7 నుంచి 8 వరకు పురాణ ప్రవచనము. 8 నుంచి 8.30 వరకు సన్నాయి మేళం ఉండేవి. ఇందులో 7 గంటల నుంచి 8 గంటల వరకు కంభంపాటి రామ్మూర్తి శాస్త్రి గారు పురాణం చెప్పేవారు. అప్పుడు నాకు బాగా చిన్నతనం 3,4 సం॥ వయసుంటుంది. శాస్త్రిగారు మా వాకిట్లోంచే ఆలయానికి వెళ్ళేవారు. పంచె కట్టుకుని, పైన ఎరుపు, ఆకుపచ్చ శాలువా కప్పుకుని ఎడమచేత్తో పుస్తకం పట్టుకుని కుడిచేత్తో పంచె కొంగు పైకి పట్టుకుని నడిచి వెడుతుండే వారు. ఆయన రాగానే బయట అరుగుల మీద కూర్చున్న ఆడవాళ్ళు లేచి నుంచునే వారు గౌరవ సూచకంగా. నేను కూడా పరుగులు పెట్టటం, అల్లరి చెయ్యటం మానేసి ఆయన వెళ్ళిపోయే దాకా అలాగే చూస్తూ నుంచునేవాణ్ణి. ఆ సమయంలో నా చిన్న మనసులో అనిపించేది. **"నేను కూడా అలాగే బల్లమీద కూచుని ఉపన్యాసం చెప్పాలి"** అని. కళ్ళు మూసుకుంటే ఇప్పటికి కూడా నా కళ్ళ ఎదురుగా కనిపిస్తుంది రామ్మూర్తి శాస్త్రి గారి రూపం. ఇలా ఉపన్యాసాలు చెప్పాలనే కోరిక నా మూడవ ఏట మనసులో నాటుకుపోయింది. ఈ రకంగా **కంభంపాటి రామ్మూర్తి శాస్త్రి గారు నాకు రెండవ గురువు.**

# 4. మొదటి పుస్తకం (శ్రీవిద్యా దర్శనము)

నా చిన్నప్పటి నుంచీ సౌందర్యలహరికి వ్యాఖ్య వ్రాయాలని కోరిక. నిజం చెప్పాలంటే నాకు సౌందర్యలహరిలోని శ్లోకాలు చదవటం కూడా రాదు. కాని దానికి వ్యాఖ్య వ్రాయాలని కోరిక మాత్రం బలంగా ఉండేది. ఆ రోజుల్లో 1992 ప్రాంతాల్లో సౌందర్యలహరికి లొల్లా లక్ష్మీధరుడు వ్రాసిన వ్యాఖ్యకు చదలవాడ జయరామశాస్త్రి గారి అనువాదం పుస్తకం తెచ్చి చదవటం జరిగింది. ఇప్పుడు ఒక చిన్న ఆలోచన వచ్చింది. సౌందర్యలహరికి వ్యాఖ్య వ్రాసే లోపల ఏవైనా కొన్ని వ్యాసాలు వ్రాస్తే బాగుండు కదా? అని. సరే ! మొదటగా **పంచదశీ మహామంత్రం** మీద ఒక వ్యాసం వ్రాశాను. అలా వ్రాసిన తరువాత దాన్ని జగ్గయ్యపేట నుంచి ప్రచురితమయ్యే **శుభం** మాసపత్రికకు పంపాను. ఒక వారం తరువాత వారి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. 'మీ వ్యాసం చాలా బాగుంది. దాన్ని మా పత్రిక వచ్చే సంచికలో ప్రచురిస్తాము.' ఇది ఆ ఉత్తరం సారాంశం. చెప్పినట్లుగానే తరువాత సంచికలో పంచదశీ మహామంత్రం వ్యాసం ప్రచురితమయింది. **శ్రీవిద్యకు, మంత్ర శాస్త్రానికి సంబంధించి ప్రచురితమైన మొదటి వ్యాసం ఇదే కావచ్చు.** శ్రీవిద్యకు సంబంధించి, అందులోను మంత్రశాస్త్రానికి సంబంధించిన విషయాలు బయటకు చెప్పటానికి ఇష్టపడే వారు కాదు. మంత్రశాస్త్రాన్ని గుప్తంగా (రహస్యంగా) ఉంచాలి అని భావించేవారు. మంత్రాన్ని గురించి ఎవరూ బయట మాట్లాడే వారు కూడా కాదు. అటువంటి రోజుల్లో పంచదశి మహామంత్రాన్ని గురించి వ్యాసం వ్రాశాను. అది ప్రచురితమయింది. అది **నా మొదటి వ్యాసం**. నా ఆనందానికి అవధులేవు. ఆనాడు ఏనుగు అంబారీ ఎక్కినంత ఆనందం అయింది. ఇది నా మొదటి పుస్తకం. వాక్యం ఎలా వ్రాయాలో కూడా నాకు సరిగా తెలియదు. మా మిత్రులు, తెలుగు లెక్చరర్, కవితాకృష్ణ **పింగళి వేంకట కృష్ణారావు** గారు ఈ విషయంలో నన్ను ముందుకు నడిపించారు. నేను వ్రాసిన వ్యాసాన్ని దిద్ది, వాక్య నిర్మాణం సరిచేసి మళ్ళీ మళ్ళీ ఐదుసార్లు వ్రాయించారు. ఇప్పుడు ఆ వ్యాసం ప్రచురితమైంది. **ఈ విషయంలో ఆయనకు మాటలలోచెప్పలేని కృతజ్ఞతలు.** ఆ ఋణం తీరేది కాదు.

ఆ ఆనందం అనిర్వచనీయం. చాలా గొప్ప విజయం సాధించినట్లుగా ఉంది. వెంటనే **శ్రీచక్రం** మీద ఇంకొక వ్యాసం వ్రాసి పంపాను. పత్రిక ప్రచురణ కర్తల దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. మీ వ్యాసం చాలా బాగుంది ప్రచురిస్తామని. ఇనుమడించిన ఉత్సాహంతో ఇంకొక ఆరు వ్యాసాలు వ్రాసి పంపాను. అన్నింటికీ అదే సమాధానం. మీ వ్యాసాలు చాలా బాగున్నాయి వీలు చూసుకుని ప్రచురిస్తాము. ఇక్కడ విచిత్రం ఏమంటే పంచదశీ మహామంత్రం తప్ప ఇంక ఏ వ్యాసము వారు ప్రచురించలేదు. కాని వారు వ్రాసిన ఉత్తరాలవల్ల మొత్తం ఎనిమిది వ్యాసాలు వ్రాశాను. ఇవి ఎక్కడా ప్రచురితం కాలా. **ఈ వ్యాసాలు వ్రాసేటప్పుడే వాక్యనిర్మాణంలో శ్రీ పింగళి వేంకట కృష్ణారావు గారు నాకు గొప్పగా సహాయం చేశారు. ఆ రోజున ఆయనే అలా చేయకపోతే ఇవాళ్టి రోజున ఇన్ని పుస్తకాలు వ్రాసి ఉండేవాణ్ణి కాదు.** ఈ రకంగా నాతో వ్యాసాలు వ్రాయించిన **ఆయన నాకు మూడవ గురువు.** కొన్ని రోజులు గడిచాయి. ఇప్పుడు చిన్న ఆలోచన, ఈ మొత్తం వ్యాసాలను ఒక పుస్తకంగా ప్రచురిస్తే పోలేదా? ఈ వ్యాసాలన్నీ తీసుకుని పుష్పగిరి పీఠం ఆస్థాన విద్వాంసులు **శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ** గారి దగ్గరకు వెళ్ళాను. ఆయన చాలా గొప్ప పండితుడు. ఒకసారి చదివితే ఏ విషయమైనా ఆయనకు గుర్తుండిపోతుంది. నిద్ర లేపి అడిగినా సరే శ్లోకాలతో సహా విషయం పూర్తిగా వివరిస్తారు. అసూయ, ఆభిజాత్యం లేని మనిషి సహృదయుడు, మంచివాడు. 'తీరుబడిగా కూర్చుని వ్యాసాలన్నీ చదవండి' అన్నారు. నేను చదివాను. ఆయన అసాంతం విని చాలా బాగున్నాయి. వీటన్నింటిని కలిపి ఒక పుస్తకంగా ప్రచురించవచ్చు అన్నారు. ఇంకేముంది ఆ వ్యాసాలన్నీ కలిపి **'శ్రీవిద్యాదర్శనము'** అనే పేరుతో వంద పేజీల పుస్తకం ప్రచురించాను. అందులోని వ్యాసాలన్నీ శ్రీవిద్యకు సంబంధించినవే 1995 ఫిబ్రవరిలో **పుస్తకముద్రణ** పూర్తయింది. ఆ పుస్తకాన్ని కుర్తాళం పీఠాధిపతులకు పంపాను. పుస్తకం బాగుంది. నేను 'మే' నెలలో విజయవాడ వస్తాను. అప్పుడు దాని ఆవిష్కరణ పెట్టుకోండి అని యాబులూరి లోకనాథశర్మ గారితో కబురు చేశారు. మనసును ఉగ్గబట్టుకుని రెండు నెలలు ఆగాను. 2-5-1995న కుర్తాళం పీఠాధిపతులు **శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతీస్వామి** వారు ఆ పుస్తకాన్ని ఆవిష్కరించి **'శ్రీవిద్యారత్నాకర'** అనే బిరుదుతో సత్కరించారు.

ఇక్కడ తెలుసుకోవలసిన విషయం ఇంకోటుంది. ఆ రోజున గోకరాజు గంగరాజు గారు **జ్యోతిషవిజ్ఞాన పీఠానికి** లక్ష రూపాయలు విరాళం ఇస్తున్నారు. ఆ సందర్భంగా ఆయనకు సత్కారం జరుగుతోంది. ఆ సభలో శ్రీవిద్యాదర్శనము గ్రంథావిష్కరణ జరిగింది. స్టేజి మీద మా కళాశాల ప్రిన్సిపాల్, సెక్రటరీ మరియు కరస్పాండెంట్ శ్రీ గుండవరపు ప్రజాపతిరావు గారు కూడా ఉన్నారు. జ్యోతిష విజ్ఞాన పీఠానికి ఆయన సెక్రటరి. స్టేజి మీదికి రమ్మని నా పేరు పిలిచినప్పుడు స్వయంగా ప్రజాపతిరావుగారు స్టేజి దిగివచ్చి నన్ను చెయ్యి పట్టుకుని స్టేజిపైకి తీసుకువెళ్ళారు. **నేను పని చేస్తున్న కళాశాల సెక్రటరీ నన్ను ఆ విధంగా గౌరవించటం నేను జీవితంలో మరచిపోలేని విషయం.**

అది నేను వ్రాసి ముద్రించిన మొదటి పుస్తకం. ప్రూఫ్ దిద్దటం తెలియక పోవటంతో ముద్రారాక్షసాలు ఎక్కువగానే ఉన్నాయి. ఆ పుస్తకానికి శ్రీప్రసాదరాయ కులపతి గారు (ప్రస్తుతం కుర్తాళం పీఠాధిపతులు) శ్రీ గరిమెళ్ళ సోమయాజులు గారు (పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు) శ్రీముఖాలు ఇచ్చారు. ఆ పుస్తకం మూడు ముద్రణలు పడింది. అయినా అందులోని ముద్రారాక్షసాలను నేను సరిచెయ్యాలా. ఇప్పటికీ నాచేతగానితనానికి గుర్తుగా వాటిని అలాగే ఉంచాను. ఇక్కడ ఇంకొక విషయం చెప్పాలి. శ్రీచక్రం గురించి చదువుతున్నప్పుడు చిన్న అనుమానం వచ్చింది. శ్రీచక్రంలో మూడు వృత్తాలుంటాయి. అవి భూపురానికి, షోడశ దళానికి మధ్యన ఒకేచోట ఉంటాయి అని, అలాకాదు మూడు వృత్తాలు విడివిడిగా 1 భూపురానికి, షోడశ దళానికి మధ్యన ఒకటి, 2 షోడశ దళానికి, అష్టదళానికి మధ్యన ఒకటి 3 అష్టదళానికి, చతుర్దశారానికి మధ్యన ఒకటి ఉంటాయి అని రెండు రకాలుగా వ్రాశారు. ఈ రెండింటిలోను ఏ వాదన సరియైనది అనే విషయం తెలుసుకోవటానికి చాలామంది పెద్దవాళ్ళ దగ్గరకు వెళ్ళాను. వాళ్ళెవరూ నా అనుమానం నివృత్తి చేయలేదు. పై పెచ్చు నన్ను "వితండవాదం చేస్తున్నావు" అన్నారు. చివరకు ఒక స్వామి **'పుష్పగిరిలో విశ్వనాధ శాస్త్రి** గారు ఉన్నారు. ఆయనకు ఉత్తరం వ్రాయి. నీ అనుమానం ఆయన తీర్చగలరు' అని చెప్పారు. నేను విశ్వనాధశాస్త్రి గారికి ఉత్తరం వ్రాశాను. మూడు నెలలైంది. వారి దగ్గర నుంచి

జవాబు లేదు.  నాకు సమాధానం ఎందుకు వ్రాస్తారు? అనుకున్నాను. నాలుగు నెలల తరువాత వారి దగ్గర నుండి సమాధానం వచ్చింది. అందులో 'నీ అనుమానం చిన్నదిగా కనిపించినప్పటికీ చాలా పెద్దది. అందుకే ఎవరూ నీకు సమాధానం చెప్పలేదు. పనుల వత్తిడివల్ల కొంచెం ఆలస్యమైంది. అంటూ వృత్తాలు రెండు రకాలుగా చెప్పబడటానికి కారణాలు వివరిస్తూ, దానికి ఋజువుగా కొన్ని గ్రంథాలలోని పేజీలు ఫోటోస్టాట్ కూడా పంపారు. ఈ విషయం తెలుసుకోవటానికి నేను చాలా శ్రమ పడ్డాను. ఆరు నెలలపాటు శ్రీవిద్యాపరులనబడే అనేకమందిని కలివాను. అందులో మద్దులపల్లి మాణిక్యశాస్త్రి గారు ఒకరు. రాష్ట్రపతి అవార్డు గ్రహీత. ఆయన మాట్లాడుతూ 'ఈ విషయం నాకు తెలియదు. గ్రంథాలు చూడవలసిందే' అన్నారు. నాకు చాలా ఆనందం అనిపించింది. అంత పెద్దాయన విషయం తనకు తెలియదు అని చెప్పేశారు. దీంతో ఒక విషయం నాకు అర్థమయింది. **"శ్రీవిద్యాపరులు అంతా మంత్రజపం, పూజ చేసుకునే నిష్ణాతులే. అందరూ శిష్టాచార సంపన్నులే. కాని శ్రీచక్రం గురించి గాని, మంత్రం గురించి గాని వీరికి తెలిసింది చాలా తక్కువ. ఇక మీదట వీటి గురించి తెలుసుకోవటానికి ఎవరూ నాలాగా కష్టపడరాదు. నేను సేకరించిన విషయాలన్నీ సామాన్యులకు అర్థమయ్యే బాషలో, గ్రంథస్థం చెయ్యాలి"** అని నిర్ణయించుకున్నాను. దీని ఫలితమే **శ్రీవిద్యాదర్శనము.** అప్పటి నుంచీ వరుసగా, నాకు తెలియకుండానే శ్రీవిద్య మీద గ్రంథాలు వ్రాయటం జరిగింది.

మొదటి పుస్తకం దరిదాపుగా ఉచితంగానే పంచటం జరిగింది. శ్రీవిద్యాపరుడుగా నాకు పేరు తెచ్చింది ఈ పుస్తకమే. పుస్తకం అట్ట సింగిల్ కలర్‌లో ఉంది.

గ్రంథావిష్కరణ జరిగిన తరువాత జూన్ నెలలో భక్తశిఖామణి బెజవాడ రామశేషయ్య గారు నన్ను పిలిచి "మీరు ఏదో గొప్ప గ్రంథం వ్రాశారట. దాన్ని కుర్తాళం పీఠాధిపతులు ఆవిష్కరించారట. దానిమీద ఒక వారం రోజులు రామకోటిలో ఉపన్యాసాలు చెప్పవచ్చు కదా!" అన్నారు. ఉపన్యాసాలు చెప్పాలనే కోరిక నాకు ఉన్నది. ఇప్పుడు రామశేషయ్య గారు తనంతట తానుగా రామకోటిలో ఉపన్యాసం చెప్పమని అడుగుతున్నారు. రామశేషయ్య గారు రామకోటిలో ఆధ్యాత్మిక

కార్యక్రమాలు చూస్తుండే వారు. ఆ రోజుల్లో రామకోటిలో ఉపన్యాసం చెప్పటమంటే సామాన్యం కాదు. సామాన్యులకు అక్కడ అవకాశం దొరికేది కాదు. అటువంటి అవకాశం నాకు అయాచితంగా వచ్చింది. 'సరే' అన్నాను. వచ్చిన అవకాశాన్ని వినియోగించుకున్నాను. అనుకున్నట్లుగా వారం రోజుల కార్యక్రమం పూర్తయింది. "చాలా గొప్ప విషయాలు చెప్పారు. ఇటువంటి ఉపన్యాసాలు ఇంతవరకు ఇక్కడ ఎవరూ చెప్పలేదు" అన్నారు శ్రోతలు. అప్పుడు నాకర్థమయింది. నేను వ్రాసిన పుస్తకం తక్కువదేమీ కాదు' అని. **అది నా మొదటి ఉపన్యాసం.**

ఈ పుస్తకం సోమయాజుల శర్మ గారికి బాగా నచ్చింది. పుస్తకం బయటకు వచ్చిన తరువాత దీన్ని అమ్మాలని, దానిమీద డబ్బులు రావాలని చూడద్దు. పుస్తకం చాలా బాగుంది. ఇది పదిమందిలోకి వెళ్ళాలి. సాధ్యమైనంత వరకు పెద్దవాళ్ళకి పంచి పెట్టండి. 'ముద్రించిన పుస్తకాలలో కొన్ని నా దగ్గర పెట్టండి. నా దగ్గరకు చాలామంది వస్తారు. వాళ్ళలో అర్హులకు పుస్తకం ఇస్తాను' అన్నారు గరిమెళ్ళ సోమయాజులు గారు. అలాగే ఒక వంద పుస్తకాలు వారి దగ్గర పెట్టేశాను. కొంతకాలం తరువాత 'మీ పుస్తకం గురించి, మీ గురించి ఏమనుకుంటున్నారో తెలుసా?' అన్నారు సోమయాజులు గారు. 'ఏమనుకుంటున్నారు?' అన్నాను కుతూహలంగా, "ఈ పుస్తకం వ్రాసినాయనకు సుమారు డెబ్బై సంవత్సరాలైనా ఉండి ఉంటుంది. కాషాయ బట్టలు కట్టుకుని నెత్తిన జుట్టు, గడ్డాలు మీసాలు బాగా పెంచేసి, నిరంతరం సాధనలో ఉంటారు. చాలా గొప్ప పుస్తకం. అతితేలికైన భాషలో పామరులకు అర్థమయ్యేరీతిలో వ్రాశారు. వారిని మేము ఒకసారి దర్శించవచ్చా? అని నాకు ఫోన్ చేసి అడుగుతున్నారు" అని చెప్పారు.

నా ఆనందానికి అవధుల్లేవు. నేను కేవలం సరదాగా వ్రాసిన పుస్తకం అంత గొప్పదా? అనిపించింది. నిజంగా నాకు పేరు ప్రఖ్యాతులు రావటానికి కారణం ఈ పుస్తకమే. ఈ ప్రోత్సాహమే నన్ను ఇంకొక పుస్తకం వ్రాయటానికి పురిగొల్పింది. ఈ పుస్తక ముద్రణకు నన్ను ప్రోత్సహించిన శ్రీ గరిమెళ్ళ సోమయాజులు గారు నాకు నాల్గవ గురువు. ఆయన ఋణం ఈ జన్మలో తీర్చుకోలేదు. నాతో మొదటిసారి ఉపన్యాసం ఇప్పించిన బెజవాడ రామశేషయ్య గారు ఐదవ గురువు.

# 5. రెండవ పుస్తకం (శ్రీవిద్యాదర్పణము)

మొదటి పుస్తకం శ్రీవిద్యాదర్శనము మొదటి ముద్రణ కాపీలు అన్నీ పంచి పెట్టేశాను. రెండవ ముద్రణ రావాలి. అప్పటి మా ప్రిన్సిపాల్ ప్రజాపతిరావు గారు నన్ను పిలిచి "పుస్తకం అట్ట మల్టీకలర్‌లో వేయించండి" అన్నారు. నా మిత్రులు పింగళి కృష్ణారావుగారితో కలిసి ప్రెస్‌కు వెళ్ళి మల్టీకలర్ అట్ట కావాలి అని అడిగాను. ఒకట్టైతే కష్టమండి. నాలుగైతే వెంటనే ఇచ్చేస్తాను అన్నాడు ప్రెస్ యజమాని యుగంధర్. నాలుగు కవర్ పేజీలు ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తుంటే 'ఎలాగూ ఇంకా వ్రాస్తారు కదా ! కవర్ పేజీలు వేయించెయ్యండి' అని సలహా ఇచ్చారు కృష్ణారావు గారు. నాలుగు ప్రింట్ వేసెయ్యండి అన్నారు. నాల్గింటికీ పేర్లు చెప్పండి అన్నాడు యుగంధర్ గారు. కళ్ళు మూసుకుని నాలుగు పేర్లు చెప్పాను. 1. శ్రీవిద్యా దర్శనము 2. శ్రీవిద్యా దర్పణము 3. శ్రీవిద్యా రహస్యము 4. శ్రీవిద్యా సర్వస్వము. అన్నింటికీ బొమ్మ ఒకటే. పేరు, రంగు మాత్రమే మార్పు. రెండు రోజుల్లో అట్టలు వచ్చేసాయి. మొదటి పుస్తకం మళ్ళీ వెయ్యి కాపీలు ముద్రించి పంచి పెట్టేశాను. ఈ పుస్తకాన్ని దేవాదాయ ధర్మాదాయ శాఖ వారు ప్రచురించే "ఆరాధన" మాసపత్రికలో సీరియల్‌గా కూడా ముద్రించారు. ఆ రోజుల్లో గుంటూరులో పోస్టల్, డిపార్ట్‌మెంట్‌లో పని చేసే రావుగారు నా దగ్గరకు బాగా వస్తుండేవారు. ఆయన యోగా చేసేవారు. ఒకరోజు రాత్రి 8.00 గం॥ వచ్చి "గుణదలలో ఒక వ్యక్తి మరణించాడు. కులంరీత్యా అతడు మంగలి, అతని దగ్గర చాలా పుస్తకాలున్నాయి. వాళ్ళ వాళ్ళకి ఎవరికీ వాటిమీద ఆసక్తి లేదు. వాటిని అందరికీ ఇచ్చేస్తున్నారు. నేను కూడా కొన్ని పుస్తకాలు తెచ్చుకున్నాను ఇంకా కొద్దిగా ఉన్నాయి" అన్నారు. వెంటనే ఆయనతో పాటు వెళ్ళి మిగిలిన పుస్తకాలన్నీ నేను తెచ్చుకున్నాను. వాటిలో సుభగోదయ స్తుతి ఒక పాతపుస్తకం దొరికింది. ఎవరు వ్రాశారో తెలియదు. ఆ పుస్తకం మార్కెట్‌లో అందుబాటులో లేదు. 'దాన్ని మనం వ్రాస్తే' చిన్న ఆలోచన. ఆ మరునాడే వ్రాయటం మొదలు పెట్టాను. శంకర భగవత్పాదుల పరమ గురువైన గౌడపాదుల వారు అమ్మవారి తత్త్వాన్ని గురించి వ్రాసిన పుస్తకమది. దాన్ని చదివిన తరువాతే శంకరుడు **సౌందర్యలహరి** వ్రాశాడని అంటారు. పుస్తకం వ్రాయటం

పూర్తయింది. ముద్రించటం ఎలా? డబ్బులు కావాలి కదా? ఎవరు ముద్రిస్తారు? ఇంతలో మిత్రుడు జంధ్యాల పరదేశిబాబు మా కాలేజీలోనే తెలుగు లెక్చరర్. టిటిడి వారికి అప్లికేషను పెట్టు. వాళ్ళు డబ్బులు ఇస్తారు' అని సలహా ఇచ్చాడు. అప్లికేషను పెట్టాను. ముద్రణకు రూ. 30,000 డబ్బులిచ్చారు. ఆ పుస్తకం పేరు **శ్రీవిద్యాదర్పణం.** 1996 జనవరి రెండవ తారీకున గణపతి సచ్చిదానంద స్వామివారు దాన్ని ఆవిష్కరించి ఘనంగా సత్కరించారు. అప్పుడు కప్పిన పట్టుశాలువలో పట్టు పోగుకన్న జరీ పోగే ఎక్కువగా ఉంటుంది. ఇప్పుడది శిథిలమై పోయింది. అయినా ఆ గుర్తుగా చాలా జాగ్రత్తగా దాచుకున్నాను దాన్ని. స్వామివారితో అదే మొదటి పరిచయం. అప్పటికే నా పుస్తకాలు చాలా సరళమైన భాషలో ఉంటాయని పేరు వచ్చింది.

ఒకసారి ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చి "పుణ్యానందముని వ్రాసిన **కామకలా విలాసము** చదివితే ఏమీ అర్థం కావటం లేదు. మీరు దాన్ని సరళమైన భాషలో వ్రాయకూడదా?" అన్నాడు. సరే చూద్దాం అన్నాను. శ్రీవిద్యలో సమయాచారాన్ని వివరిస్తూ, అద్వైతాన్ని బింబ ప్రతిబింబవాదము రూపంలో వ్రాసిన ఉత్తమోత్తమమైన పుస్తకమది. దాని ముద్రణకు కూడా టిటిడి వారే సహాయం చేశారు. దానిపేరు **శ్రీవిద్యా సర్వస్వము.** 1997 జనవరిలో గణపతి సచ్చిదానంద స్వామివారి చేతులమీదగానే పుస్తకం ఆవిష్కృతమైంది. తరువాత ఇంకొక పుస్తకాన్ని వ్రాసి దానికి **శ్రీవిద్యారహస్యము** అని పేరు పెట్టాను. ఈ రకంగా వేయించిన అట్టలు నాలుగు వాడేశాను. ఆ తరువాత దేవీభాగవతం కథల రూపంలో **దేవీకథాసుధ** అనే పేరుతో ముద్రించాను. ఇప్పటికి నేను వ్రాసిన ఐదు పుస్తకాలు మార్కెట్‌లో ఉన్నాయి. చదివిన వాళ్ళు మంచి పుస్తకాలు అన్నారు. మార్కెట్‌లో శ్రీవిద్యకు సంబంధించిన పుస్తకాలు వ్రాయటంలో నాకంటూ ఒక పేరు ఏర్పడింది. అప్పటిదాకా శ్రీవిద్య అంటే భయపడే వాళ్ళు క్రమేణా శ్రీవిద్యకు సంబంధించిన పుస్తకాలు చదవటం, మంత్రోపదేశం పొందటం, లలితాసహస్రనామ పారాయణ చెయ్యటం మొదలు పెట్టారు.

ఈ రకంగా అసలు వ్యాసం వ్రాయటం కూడా చేత కాని నేను ఇప్పటివరకు 48 పుస్తకాలు వ్రాశాను. ఇవన్నీ నాకు తెలిసి, నా గొప్పతనంవల్ల, నా పాండిత్యం

వల్ల కానేకాదు. కేవలము పరమేశ్వరి అనుగ్రహంతోనే ఈ పుస్తకాలు వ్రాయటం జరిగింది. ఇందులో అతిశయోక్తి ఏమాత్రం లేదు.

ఈ మధ్యన సుబ్రహ్మణ్యస్వామి ఉపాసనా విధానము మీద పుస్తకం కావాలని అడిగారు. అది కూడా వ్రాశాను. ఇంకా పూర్తి కాలేదు. ఈ సంవత్సరం ఆఖరుకు బయటకు రావచ్చు. ప్రసిద్ధి చెందిన ఆరు సుబ్రహ్మణ్య క్షేత్రాలు దర్శించి పుస్తకం వ్రాయటం ప్రారంభించాను. డిటిపిలో ఉంది. అది నా శిష్యుడు టి.మధు పేరుతో వస్తుంది. తరువాత పది సం॥ క్రితం ప్రారంభించిన మహావాక్య దర్పణం, మంత్ర గణపతి పుస్తకాలు పూర్తి చేశాను. అష్టావక్రగీత నాకు అత్యంత ప్రీతి పాత్రమైన పుస్తకం. దాన్ని నాదైన శైలిలో వ్రాశారు. చిన్న చిన్న విషయాలతో రెండు పుస్తకాలు నా భార్య రమాదేవి పేరుతో వ్రాశాను. నేను వ్రాసిన పుస్తకాలలో బాగా పేరెన్నిక గన్నవి. **చతుర్వేద భాష్యం, బ్రహ్మసూత్రాలకు శ్రీవిద్యాపరంగా భాష్యం. బ్రహ్మసత్యం-జగన్మిథ్యా, మహావాక్య దర్పణము, అష్టావక్రగీత, లలితా సహస్రం, విష్ణు సహస్రం భాష్యాలు.** ఇవికాక ఇంకా కొన్ని పుస్తకాలు వ్రాయాలని ఉంది. కాని దైవేచ్ఛ ఎలా ఉందో తెలియదు.

శ్రీవిద్యాపరంగా చూస్తే నేను వ్రాసిన పుస్తకాలలో **శ్రీవిద్యాసారథి** (లలితా సహస్రనామ భాష్యం) చాలా గొప్పది. అది దేనికీ అనువాదం కాదు. భాస్కరరాయల వారి భాష్యాన్ని ప్రాతిపదికగా తీసుకుని, దానికి శ్రీవిద్యాపరమైన గ్రంథాలు, ఉపనిషత్తులు, దేవీభాగవతము అన్నీ జోడించి వ్రాసిన పుస్తకమది. అలాగే సౌందర్యలహరి కూడా. అప్పటివరకు సౌందర్యలహరికి 27 భాష్యాలున్నాయి. వాటన్నింటినీ చదివి 28వ భాష్యం వ్రాశాడు. లొల్లా లక్ష్మీధరుడు. నేను లక్ష్మీదరుడి వాఖ్యతో పాటుగా మిగిలిన శ్రీవిద్యాపరమైన గ్రంథాలు, ఉపనిషత్తులు, కలిపి ఈ పుస్తకం వ్రాయటం జరిగింది. నేను వ్రాసిన లలితా సహస్రనామ భాష్యము, చదివితే భాస్కరరాయల వారి సౌభాగ్యభాస్కరము, నేను వ్రాసిన సౌందర్యలహరి వ్యాఖ్య చదివితే లొల్లా లక్ష్మీధరుడి వ్యాఖ్య చదవడనవసరం లేదని ఘంటాపథంగా చెప్పగలను.

**శ్రీ కైవల్యసారథి** పేరుతో వ్రాసినది విష్ణు సహస్రనామ భాష్యం. దీనికి శంకరుల వారి భాష్యం ప్రాతిపదికగా తీసుకుని, భట్టరువారు వారు వ్రాసిన భాష్యము,

రంగనాధాచార్యుల వారు వ్రాసిన నిరుక్తం ప్రకారము సహస్ర నామాలకు అర్ధము, వైష్ణవోపనిషత్తులు, భగవద్గీత, దశోపనిషత్తులు, విష్ణుపురాణము ఇత్యాది గ్రంథాలు, కలిపి ఈ వ్యాఖ్య వ్రాయటం జరిగింది.

మొత్తం మీద చెప్పాలంటే నా పుస్తకాలు ఏవీ, దేనికీ అనువాదం కాదు. నాకు సంస్కృతం రాదు కాబట్టి అనువాదం అనే ప్రశ్నే లేదు.

నేను వ్రాసిన పుస్తకాలలో వేదభాష్యం చాలా గొప్పది. ఏమీ తెలియని వాడికి, కొద్దిగా చదువుకున్న వాడికి కూడా వేదాన్ని గురించి తెలుసుకునేందుకు వీలుగా వ్రాసినది ఈ పుస్తకం. ఇది మొత్తం నాలుగు భాగాలు. మొదటి రెండు భాగాలు వేదాలు, చివరి రెండు భాగాలు 108 ఉపనిషత్తులు. పూర్తి వచన రూపంలో, అందరికీ అర్థమయ్యే రీతిలో వ్రాయటం జరిగింది.

బ్రహ్మసూత్రాలు వ్రాయటం ఒక గొప్ప ప్రక్రియ. ఇది మొత్తం మూడుసార్లు వ్రాశాను. మూడుసార్లు అచ్చయింది. మొదటిసారి సూత్రము దానికి అర్థం వ్రాశాను. రెండవసారి శంకర భాష్యాన్ని అనుకరిస్తూ అద్వైతపరంగా వ్యాఖ్య వ్రాశాను. దీన్ని మణిద్వీప మహా సంస్థానం, పెనుశిలకోన, పొట్టి శ్రీరాములు నెల్లూరుజిల్లా తరపున **మాతా విజయేశ్వరీదేవి** ఆశీస్సులతో ప్రచురించారు. కాగా కొద్ది రోజులకే శ్రీవిద్యాపరంగా వ్యాఖ్య వ్రాయాలనిపించింది. అదే మాట గరిమెళ్ళ సోమయాజులు గారికి చెప్పాను. ఇంతవరకు ఎవరూ వ్రాయలేదు. వ్రాయండి అన్నారు. అప్పటికే **శ్రీవిద్య** అనే పేరుతో ఒక గ్రంథం వ్రాశాను. బ్రహ్మసూత్రాలు వ్యాఖ్య కూడా వ్రాశాను కాబట్టి, ఈ పుస్తకం నాకు తేలిక అయింది. ఇది చాలా గొప్పదైన పుస్తకం. ఇప్పటిదాకా బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాసిన వారు పదముగ్గురు. అందులో మొదటివాడు శంకర భగవత్పాదుల వారు కాగా పదమూడువాడు స్వామి పరమానందనాథ. (డా॥ క్రోవి పార్థసారథి) అని గరిమెళ్ళ వారు తమ శ్రీముఖంలో వ్రాశారు. ఈ గ్రంథం మాత్రం అజరామరము. బ్రహ్మసూత్రాలకు భాష్యం చెప్పినప్పుడు మొదటగా శంకర భగవత్పాదుల వారి పేరు చెబితే, చివరగా పదమూడవ భాష్యం వ్రాసిన వాడుగా నా పేరు చెప్పి తీరాలి.

శంకర భగవత్పాదుల వారు వ్రాసిన **మహావాక్య దర్పణానికి** నేను వ్రాసిన వ్యాఖ్య అదే పేరుతో ప్రచురింపబడింది. ఇది నాకు చాలా ఇష్టమైన పుస్తకం. బ్రహ్మసూత్రాలు ఒక రకంగా గొప్పవైతే, మహావాక్యదర్పణం ఇంకొక రకంగా గొప్పది. అద్భుతమైన పుస్తకం. అందులోని 309 శ్లోకాలను చదువరుల సౌలభ్యం కోసం విషయ ప్రాతిపదికగా 21 అధ్యాయాలుగా విడదీసి వ్రాయటం జరిగింది. ఆధ్యాత్మికంగా అత్యున్నతమైన పుస్తకం. వీటిలో కొన్ని పుస్తకాలు గుంటూరులోని శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠంలో, పూర్వ పీఠాధిపతులు **శ్రీశ్రీశ్రీ నృసింహానంద భారతీ మహాస్వామి** జన్మదినం సందర్భంగా, వారి శిష్యులకు పంచి పెట్టటం జరిగింది. నృసింహానందభారతి పూర్వాశ్రమంలో మా తాతగారు. మా అమ్మకు మేనమామ. అలాగే అష్టావక్రగీత కూడా చాలా గొప్పది. నేను వ్రాసిన వాటిలో సామాన్యమైనవి ఏవీలేవు.

ఇన్ని గొప్ప పుస్తకాలు నేను వ్రాశానంటే, అది నా గొప్పతనం కాదు. పరమేశ్వరి లీల.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఒకటుంది. ఈ పుస్తకాలు నేను వ్రాయలేదు. ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు. అమ్మవారు కావాలనుకుని నాతో వ్రాయించింది. 4 అట్టలు, పేర్లు కూడా ఆ రోజు అమ్మవారు నా నోటి ద్వారా పలికించింది. అంతే నేను నిమిత్తమాత్రుణ్ణి.

ఒకసారి ఎల్.ఐ.సి. కాలనీలో చక్రార్చన జరుగుతోంది. ఆ రోజు సాయంత్రం అక్కడ చిన్న ఉపన్యాసం ఏర్పాటు చేశారు. అక్కడ ఉన్న వాళ్ళంతా పూర్ణదీక్షాపరులే. నేను ఒక గంటసేపు మాట్లాడాను. అక్కడ కూర్చున్న వాళ్ళందరూ మీరు చెప్పిన విషయాలు మాకేమీ తెలియవు' అన్నారు. చివుకుల మార్కండేయ శర్మగారు. 72 సం॥లు. విద్యాశాఖలో జాయింటు డైరక్టరుగా చేసి రిటైరైనారు. ఆయన మీరు చెప్పిన దాంట్లో కొన్ని విషయాలు మాత్రం నాకు తెలుసు' అన్నారు. అంటే శ్రీవిద్యాపరులలో కూడా శ్రీవిద్యకు సంబంధించిన విషయాలు చాలావరకు తెలియవని అర్థమయింది. ఆ విషయాలు పదిమందికి చెప్పాలి. శ్రీవిద్యను బహుళ ప్రచారం చెయ్యాలి అనేది నా తపన. అందుకే ఈ గ్రంథరచన.

# ౬. నా అనుభవాలు

నాకు తెలిసిన విషయం చాలా తక్కువ. అసలు నాకేమీ తెలియదు. అటువంటి నేను 48 పుస్తకాలు అందులోను అన్నీ చాలా గొప్పవైన పుస్తకాలు వ్రాశాను అంటే అదంతా అమ్మవారి మహాత్మ్యం కాక ఇంకేమిటి చెప్పండి.

**మూకంకరోతు వాచాలం, పంగుం లంఘయతే గిరిం, యత్కృపదామహం వందే**

భగవంతుడి కృపాకటాక్షణాలు మన మీద పుష్కలంగా ఉంటే జరగనిది ఏదీలేదు. ఏదీ అసాధ్యం కాదు. రాయితో కూడా రాగాలు పలికిస్తాడు భగవంతుడు. దానికి ప్రత్యక్ష నిదర్శనమే నేను పుస్తకాలు వ్రాయటం, ఉపన్యాసాలు చెప్పటం, హోమాలు, యాగాలు చెయ్యటం. ఈ సందర్భంగా నా అనుభవాలు కొద్దిగా చెబుతాను.

శ్రీవిద్యాదర్పణం (సుభగోదయ స్తుతి) వ్రాసేటప్పుడు ఏదో ఒక విషయం మీద అనుమానం వచ్చింది. దాన్ని అక్కడ వదిలేసి మిగిలిన పుస్తకం పూర్తి చేశాను. ఆ ఒక్క పేజీ పూర్తయితే పుస్తకం అయిపోయినట్లే. అది ఎలా వ్రాయాలో తెలియటం లేదు. ఆ రోజు రాత్రి. అప్పటిదాకా వ్రాసి పడుకున్నాను. టైము రెండు గంటలైంది. చిన్నగా నిద్ర పట్టింది. ఎవరో తట్టి లేపారు. నీకేం కావాలి. ఇదిగో ఇదేనా? అంటూ ఒక పేజీ చూపించారు. ఊ...హూ... కాదు. అలాంటిదే. కాని అది కాదు. ప్రక్కకు తిరిగి పడుకున్నాను. మళ్ళీ పిలిచారు.

'ఇదిగో. ఇదేనేమో చూడు'. అంటూ ఇంకొక పేజి చూపించారు. అవును అదే. అదే నాక్కావలసింది. చాలా ఆనందం. నాక్కావలసింది దొరికింది కాని ఎక్కడ ఉంది? అదే మాట అడిగాను. 'నీ పుస్తకాల షెల్ఫ్‌లో, ఫలానా పుస్తకంలో ఇన్నో పేజీలో ఉంది' అని చూపించారు. ఇదంతా కల. వెంటనే లేచి ఆ పుస్తకం తీశాను. వారు చెప్పిన పేజీలో ఆ విషయం ఉంది. అప్పటికప్పుడు మళ్ళీ కూర్చుని ఆ విషయం కూడా వ్రాసి పుస్తకం పూర్తి చేశాను. ఇంతకీ కలలో ఆ పుస్తకం నాకు చూపింది, విషయం చెప్పింది ఎవరు? సాక్షాత్తు అమ్మవారే.

**దేవీకథాసుధ** వ్రాస్తున్నాను. రాత్రి ఒంటిగంట దాటింది. నిశ్శబ్దమైన వాతావరణం. నా దగ్గరలో ఒక స్టూలుమీద దేవీభాగవతము, ఇతర పుస్తకాలు

ఉన్నాయి. తలవంచుకుని వ్రాస్తున్నాను. ప్రక్కనే ఉన్న స్టూలుమీద ఎవరో స్త్రీ మూర్తి కూర్చుని తదేకంగా నన్నే చూస్తున్నది. ఒక్కసారిగా తలపైకెత్తాను కూర్చున్నది ఎవరా అని. ఎవరూ లేరు. కేవలం పుస్తకాలే ఉన్నాయక్కడ. మరి ఇందాక కూర్చుని నన్ను చూస్తున్నది ఎవరు? సాక్షాత్తు అమ్మవారే.

**దేవీకథాసుధ** పుస్తకం వ్రాయటం పూర్తయింది. రాత్రి రెండు గంటల సమయం. వెళ్ళి పడుకున్నాను. పూర్తిగా నిద్ర పట్టలా. అలా అని మెలకువ గాను లేను. పై నుంచి పెద్ద కుర్చీ ఒకటి క్రింద వచ్చింది. పెళ్ళికొడుకును కూర్చోపెట్టటానికి వేసే కుర్చీ. అందులో ఒక స్త్రీ కూర్చుని ఉంది. బంగారు చీర కట్టుకుంది. వళ్ళంతా బంగారు, రత్నాల ఆభరణాలు. చేతులు పెట్టుకునే చోట సింహాలు. కాళ్ళకి రత్నాలు పొదిగిన పట్టాలు, కడియాలు. నెత్తిన మణిమయ కిరీటం. దేదీప్యమానమైన కాంతితో వెలిగిపోతోంది. క్రమేణా దానంతటదే నా దగ్గరకు వచ్చింది. శిరసువంచి అమ్మ వారి పాదాలకు నమస్కరించాను. ప్రక్కకు జరిగిపోయింది. ఇప్పుడు ఇంకొక ఆసనం వచ్చింది. అది పూర్తిగా వెండితో చేసింది. తెల్లగా మెరుస్తోంది. అందులో ఒకాయన కూర్చుని ఉన్నాడు. తెల్లని పట్టుబట్టలు కట్టుకున్నాడు. వెండి కిరీటం, ప్రశాంతమైన ముఖం. ఆయన పాదాలకు శిరసు వంచి నమస్కరించాను. అంతే ఇద్దరూ పైకి వెళ్ళిపోయారు. ఒక్కసారిగా కళ్ళు తెరిచాను. గది అంతా చీకటి. వచ్చిన వాళ్ళు పార్వతీ పరమేశ్వరులై ఉంటారనుకుని కళ్ళు మూసుకున్నాను. నిద్ర పట్టేసింది. ఈ విషయాలు దేవీకథాసుధ ముందుమాటలో వ్రాశాను.

ఒకసారి విజయవాడ, పటమటలోని గణపతి సచ్చిదానంద స్వామివారి ఆశ్రమంలో శ్రీవిద్య మీద వారం రోజులపాటు ఉపన్యాసం చెప్పాను. డా॥ సరోజిని గారి ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం జరిగింది. కార్యక్రమం ఆఖరిరోజు. ఉదయం 7.15 గం॥ కల్లా బయలుదేరి కాలేజీకి వెళ్ళిపోవాలి. 6.30 గం॥లకు దేవుడి దగ్గర కూర్చున్నాను. దేవుడి మందిరంలో అమ్మవారి విగ్రహం ఉంటుంది. దీపారాధన చేసి పూజ చేసి కళ్ళు మూసుకున్నాను. కళ్ళు తెరిచేటప్పటికి ఎదురుగా అమ్మవారి విగ్రహం ఉన్న చోట విచిత్రంగా గణపతి సచ్చిదానంద స్వామివారు కూర్చుని ఉన్నారు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. మళ్ళీ చూశాను. స్వామివారు వెళ్ళిపోయారు. అక్కడ అమ్మవారి విగ్రహం ఉంది. ఆ రోజు ఉపన్యాసం ముగింపు సమయంలో

ఇదే మాట చెప్పాను. అప్పుడు డా॥ కొల్లి కృష్ణకుమారి గారు “మీ పూజా మందిరంలో ఏమిటి? రోజూ ఇక్కడికి వచ్చి అదిగో ఎదురుగా ఉన్న ఆ కుర్చీలో కూర్చుని ఉంటున్నారు. మీ ఉపన్యాసం అయిపోగానే వెళ్ళిపోతున్నారు. ఇవాళ్ళ కూడా వచ్చారు. ఇప్పటిదాకా ఇక్కడే ఉన్నారు. ఇప్పుడే వెళ్ళిపోయారు” అని చెప్పారు. చాలా రోజుల క్రితం ఒకరోజు రాత్రి ఎవరో తలుపతట్టారు. వెళ్ళి తలుపు తీశాను. మా తాతయ్య ఎదురుగా నుంచుని ఉన్నారు. ఆయనే నా గురువు. ‘రా తాతయ్యా’ అని తలుపు తీసి పిలిచాను. లోపలికి వచ్చి కూర్చున్నారు. ఇంట్లో కుంకుమ లేదా? అన్నారు. ఉంది అన్నాను. మరి శ్రీచక్రానికి కుంకుమతో ఎందుకు అర్చన చెయ్యటం లేదు? అని వెళ్ళిపోయారు. ఇదంతా కల. అప్పటి నుంచి కుంకుమతో అర్చన చెయ్యటం మొదలుపెట్టాను.

కలలో లలితా సహస్రం పారాయణ చెయ్యటమనేది సామాన్యంగా జరుగుతూనే ఉంటుంది. మధ్యలో లేచినా నడుస్తూనే కొంతవరకు వచ్చేదాకా పారాయణ జరుగుతూనే ఉంటుంది. ఒకసారి ఎత్తైన అరుగు మీద వాలుబల్ల. దానిమీద ఏదో పుస్తకం. బల్ల ముందు నేను కూర్చుని ఉన్నాను. నా మీద తెల్లని కాంతి పడుతోంది. ఎదురుగా మసకచీకటి. చాలామంది కూర్చుని ఉన్నారు. నేను ఉపన్యాసం చెబుతున్నాను. మధ్యలో మెళకువ వచ్చింది. లేచి బాత్రూమ్‌కు వెళ్ళి వచ్చి పడుకున్నాను. కల మళ్ళీ కొనసాగుతోంది. ఇలా చాలాసేపు, దరిదాపు రాత్రంతా కొనసాగింది. తెల్లవారింది. నిద్ర లేచాను. రాత్రి చెప్పిన ఉపన్యాసం అంతా నాకు గుర్తుంది. జరిగిన విషయం నా ధర్మపత్ని రమాదేవికి చెప్పాను. “ఏదైనా పుస్తకం వ్రాయమని అమ్మవారి ఆదేశమేమో. ఎలాగూ చెప్పిన ఉపన్యాసం అంతా గుర్తుంది అంటున్నారు కదా. ఎంతవరకు వస్తుందో పేపరు మీద పెట్టండి” అంది. నిజమే అనిపించింది. రెండు రోజులు కూర్చుని స్వప్న వృత్తాంతమంతా పేపరు మీద వ్రాశాను. బాగుంది. చిన్న పుస్తకం 40 పేజీలు అయింది. అదే **లలితా రహస్యోపనిషత్తు.** ఆ పుస్తకాన్ని ధర్మపురుష, పాదుకాంత దీక్షాపరులు బ్రహ్మశ్రీ **యాబులూరి లోకనాథశర్మగారికి కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతుల సమక్షంలో అంకితమిచ్చాను.**

సప్తశతికి వ్యాఖ్య వ్రాయాలనిపించింది ప్రారంభించాను వ్రాయటం పూర్తయింది. **బాలసరస్వతీ బుక్ డిపో** వారు దీన్ని ముద్రించారు. తరువాత కొన్ని రోజులకి కాకినాడ నుంచి నాకు రిజిష్టర్ పోస్ట్‌లో ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం వ్రాసినాయన ఒక పండితుడట. ఇప్పటివరకు సుమారు ఎనభై చండీ హోమాలు చేశాను. శృంగేరీ, కంచి పీఠాధిపతుల ముందు కూడా చండీహోమం చేశాను. సప్తశతి భాష్యం కదా అని పుస్తకం కొన్నాను. పదిహేను పేజీల వరకు చదివాను. బాగానే ఉంది. పదహారవ పేజీ వచ్చేటప్పటికి ఇంక చదవబుద్ధి కాలేదు. పుస్తకాన్ని మూసేసి, దాన్ని అమ్మిన షాపుకు వెళ్ళి నాకీ పుస్తకం వద్దు. మీరు తీసేసుకోండి అని అడిగాను. దానికి షాపు యజమాని ఒప్పుకోలేదు. బయట పారేద్దాం. అనుకున్నాను. కానీ బాగుండదు అని ఆ పని చెయ్యలేదు. ఆ పుస్తకం ఎందుకూ పనికి రాదు. దానికి విలువ లేదు' ఇలాగే సాగింది ఉత్తరం అంతా. ఆ ఉత్తరం చదివిన తరువాత నేను ఆయనకు ఫోన్ చేసి "స్వామీ ! నా వల్ల ఏదైనా తప్పు జరిగిందా? ఏ విషయమైనా పొరపాటు గాని, తప్పు గాని వ్రాశానా? దయ చేసి తెలియచేస్తే, దిద్దుకుంటాను అని చెప్పాను. అసలా పుస్తకమే పనికిరాదు. అందులో 16వ పేజీ చూడండి అన్నారు. చూశాను. నాకు ఏ తప్పు కనిపించలేదు. మళ్ళీ అడిగాను. చివరకు విసుగు పుట్టి చెప్పారు. ఆ పుస్తకాన్ని గణపతి స్వామివారికి అంకితం ఇచ్చారు. గ్రంథ స్వీకరణ చెయ్యటానికి, కృతిభర్త కావటానికి ఆయనకు అర్హత ఎక్కడుంది? అని నోటికి వచ్చినట్లు మాట్లాడాడు. ఇంతకీ తేలింది ఏమిటంటే, గణపతి స్వామివారికి పుస్తకం అంకిత మివ్వటం నేను చేసిన పెద్ద తప్పు. అది ఒక్కటీ లేకపోతే మిగిలిన పుస్తకం అంతా బాగానే ఉందట.

మనది అద్వైత సిద్ధాంతం. ఈ సిద్ధాంతం ప్రకారం చరాచర జగత్తంతా పరబ్రహ్మమే. ఇందులో ప్రతిజీవి పరబ్రహ్మమే. పుస్తకాన్ని ఎవరికైనా అంకితమివ్వవచ్చు. పుస్తకాన్ని స్వామివారికి అంకితం ఇవ్వాలనిపించింది ఇచ్చాను. ఇందులో తప్పేముంది. కనిపించిందల్లా బ్రహ్మమే కదా. నా దృష్టిలో ఆయనే దేవుడు. మరి ఆయనకి అంకితం ఇస్తే నష్టం ఏముంది? **ఈ పండితుడి అహంకారం దెబ్బ తినటం తప్ప.**

ఇలాంటి సన్నివేశాలు అనేకానేకం.

ఒకసారి ఉపన్యాసానికి వెళ్ళాను. సభ ఇంకా ప్రారంభం కాలా. ఎవరో వచ్చి మాట్లాడుతున్నారు. ఇంతలో ఒకాయన వచ్చాడు. ఆయన లాయరట. "అయ్యా! నేను ప్రతినిత్యం శ్రీచక్రాన్ని ఉపాసన చేస్తాను. దుర్గాసప్తశతి పారాయణ చేస్తాను. చండీసప్తశతి, దేవీసప్తశతి కూడా పారాయణ చేస్తుంటాను. మేమంతా శ్రీవిద్యోపాసకులం లెండి' అన్నాడు. వినేసి ఊరుకున్నాను. ఇదే మాట రెండు మూడుసార్లు చెప్పాడు. అసలు ఆయనకు ఏమీ తెలియదు. ఇప్పుడు నేను ఆయనతో చెప్పాను. 'స్వామీ ! శ్రీచక్రాన్ని ఉపాసన చెయ్యరు అర్చన చేస్తారు. మంత్రాన్ని ఉపాసన చేస్తారు. ఇకపోతే చండీసప్తశతి, దేవీసప్తశతి, దుర్గాసప్తశతి అన్నీ ఒకటే. అవి విడివిడిగా లేవు. ఇలా మీరు మాట్లాడితే మీకు ఏమీ తెలియదనే విషయం అందరికీ తెలిసిపోతుంది' అన్నాను. 'మీ బోటి వాళ్ళు చెబితే మాకు తెలుస్తుంది. తెలుసుకుంటాం. చెప్పండి' అన్నాడు తడువుకోకుండా, నేనేదో చెప్పలేదన్నట్లుగా నా మీద నెపం వేస్తూ. 'కేవలం చెప్పటం కాదు శ్రీవిద్య మీద చేతనైతే పుస్తకం వ్రాయండి. పదిమందికీ ఉపయోగిస్తుంది' అంటూ హేళనగా ఉచిత సలహా కూడా ఇచ్చాడు. తరువాత ఉపన్యాసంలో ఈ సంభాషణ ప్రస్తావించి శ్రీవిద్య అనే పేరుతో పుస్తకం వ్రాస్తున్నాను అని ప్రకటించాను. దాని ఫలితంగానే 2009లో 'శ్రీవిద్య' అనే పేరుతో 350వ పేజీల పుస్తకం వ్రాసి మణిద్వీప మహాసంస్థానం, పెనుశిలకోన, మాతా విజయేశ్వరీదేవి (కరుణామయి)కి అంకితం ఇచ్చాను. ఇప్పటి వరకు శ్రీవిద్య మీద ఉన్న ఏకైక పుస్తకం అదే. విచిత్రం ఏమంటే పుస్తకాలు వ్రాయటమే కాకుండా ఉపన్యాసాలు కూడా చెప్పేవాడిని, 12-1-2014 ముక్కోటి ఏకాదశి వెళ్ళిపోయిన తరువాత ద్వాదశీ గడియల్లో నా భార్య రమాదేవి కాలం చేసింది. 24వ తారీకు పదమూడవ రోజయింది. అందరు వెళ్ళిపోయారు. 25వ తారీకు ఉదయం శాతవాహనకు బయలుదేరి నేను కూడా హైదరాబాదు వెళ్ళాను. **26-1-2014**న సికిందరాబాదులోని నాచారంలో ఉన్న నోమా ఫంక్షన్‌హాలులో **శ్రీవిద్య-మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలు** అనే విషయం మీద ఉదయం 7.00 గం॥ నుండి రాత్రి 7.00 గం॥ వరకు ఉపన్యాసం ఉంది. ఈ కార్యక్రమం "**మాతా విజయేశ్వరీ దేవి** ఆధ్వర్యంలో జరిగింది. అది ప్రపంచ రికార్డు కోసం ఇచ్చిన ఉపన్యాసం.

28వ తారీకు ఉదయం విజయవాడ వచ్చేసాను. ఇన్ని రోజులు నా భార్య పోయిన బాధ నాకు తెలియలా. ఇప్పుడు తెలుస్తోంది. పెళ్ళైన కొత్తలో ఆవిడకి నేను ఒక నీలంరంగు చీర కొన్నాను. ఆ చీర కట్టుకుని, చేతిలో సూట్‌కేసు తీసుకుని వచ్చి తలుపు దగ్గర నుంచునేది. ఏం చెయ్యటానికి తోచేది కాదు. దుఃఖం పొర్లుకు వచ్చేది. అలా శూన్యంలోకి చూస్తూ చాలాసేపు ఏడ్చేవాణ్ణి. బ్రతుకు దుర్భరం అనిపించేది. కొన్నిరోజులు గడిచిన తరువాత ఏదైనా ఒక పుస్తకం వ్రాద్దామనిపించింది. ఏం రాద్దాం? వేదాల మీద పుస్తకం వ్రాస్తే ఎలా ఉంటుంది? వేదభాష్యం, రాద్దామా? విన్నవాళ్ళు నవ్వారు. మీరు వేదభాష్యం వ్రాస్తారా? అన్నారు హేళనగా. ఔను అన్నాను. కాని ఎలా వ్రాయాలి? నేను వేదం చదువుకోలేదు. నాకు సంస్కృతం రాదు. మరి ఎలా వ్రాయటం? పరమేశ్వరానుగ్రహం ఉంటే తప్ప వేదభాష్యం వ్రాయటం సాధ్యంకాదు అనుకున్నాను.

వ్యాసభగవానుడు వేదవిభజన చేసిన తరువాత 'బ్రహ్మసూత్రాలు వ్రాయాలి' అనుకున్నాడు. కాని ఎలా ? అప్పుడు బదరికా వనానికి వెళ్ళి 13 సంవత్సరాలు తపస్సు చేసి పరమేశ్వర సాక్షాత్కారం పొంది, ఆ తరువాత బ్రహ్మసూత్రాలు వ్రాశాడు. ఇప్పుడు నేను కూడా వేదభాష్యం వ్రాయాలంటే పరమేశ్వరానుగ్రహం పూర్తిగా కావాలి. పరమేశ్వరుడంటే ఈశ్వరుడే. కాబట్టి రుద్రహోమం చెయ్యాలి. అతిరుద్రం చెయ్యాలి. అంటే నమ్మకాన్ని 1331 సార్లు హోమం చెయ్యాలి. 1.3.2014న ప్రారంభం చేసి 27-3-2014 వరకు ప్రతిరోజు ఉదయం 7.00 గం॥ నుంచి సాయంత్రం 6.00 వరకు అతిరుద్రం హోమం చేశాను. ఏప్రియల్ నాలుగున వేదభాష్యం పుస్తకం వ్రాయటం ప్రారంభించాను. కనీసం ఐదువందల పేజీలైనా వ్రాయలేకపోతానా? అనే ధీమా. ఉదయం ఏడుగంటలకు కూర్చుంటే మధ్యాహ్నం భోజనానికి లేవటం. సాయంత్రం మూడుగంటలకు కూర్చుంటే రాత్రి తొమ్మిది వరకు వ్రాసేవాణ్ణి. ఒక్కొక్క రోజు రాత్రి పన్నెండుఅయ్యేది. రాత్రి ఏ రెండు గంటలకో మెలకువ వచ్చేది. మళ్ళీ వచ్చి కూచునేవాణ్ణి లేకపోతే ఏవో ఆలోచనలు. జ్ఞాపకాలు. పిచ్చెక్కుతుంది. అర్ధరాత్రి బట్టలు చింపుకుని ఊరిమీద పరుగెత్తాలనిపించేది. అలా రోజుకు పద్దెనిమిది గం॥ చొప్పున వందరోజులు వ్రాశాను. వేదభాష్యం 1700 పేజీల పుస్తకం తయారైంది. చుట్టుప్రక్కల వాళ్ళంతా రాత్రులు తలుపులు కూడా

వేసుకోకుండా, లైట్లు తియ్యకుండా అలాగే పడుకున్నాను అనుకునే వాళ్ళు. కొంతమందైతే వచ్చి అడిగేశారు కూడా. మొత్తానికి **పార్థసారథీయము** అనే పేరుతో **చతుర్వేద భాష్యం,** 108 ఉపనిషత్తులతో సహా సామాన్యుడికి అర్థమయ్యే రీతిలో, అతిసులభశైలిలో నాలుగుభాగాలుగా పుస్తకంవచ్చింది. నా జీవితంలో నేను సాధించిన అతి గొప్పవిజయం అది. ఈ పుస్తకానికి రెండు ప్రపంచ రికార్డులు 1. జీనియస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్సు, 2. వండర్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డు లభించాయి.

2015లో శంకరభాష్యానికి అనుగుణంగా అద్వైత సిద్ధాంతంతో బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాశాను. అనువాదం కాదు. అనుకరణ మాత్రమే. దీన్ని మాతావిజయేశ్వరీ దేవి వారి ఆశ్రమం తరఫున ప్రచురించారు. తరువాత అమ్మవారే పరబ్రహ్మమని నిరూపించాలనిపించింది. 2016లో **శ్రీవిద్యలో ప్రతిపాదించిన లలితా త్రిపుర సుందరియే పరబ్రహ్మమని నిరూపణ చేస్తూ శ్రీవిద్యాపరంగా బ్రహ్మసూత్ర భాష్యం వ్రాశాను.** దానిపేరే **శ్రీవిద్యాబ్రహ్మసూత్రభాష్యము.**" అద్వైత సిద్ధాంతంలో శ్రీవిద్యాపరంగా వ్రాసిన మొదటి బ్రహ్మసూత్రభాష్యం ఇదే. ఇప్పటివరకు బ్రహ్మసూత్రాలకు పన్నెండుమంది భాష్యంవ్రాశారు. అందులో మొదటిది శంకరాచార్యులు వ్రాసినది కాగా పదమూడవది శ్రీవిద్యా బ్రహ్మసూత్రభాష్యం. చరిత్ర **ఉన్నంత వరకు, బ్రహ్మసూత్రాల పేరు చెప్పినంత వరకు, శ్రీవిద్యా బ్రహ్మసూత్ర భాష్యం, పేరుకూడా ఉండిపోతుంది. నా జీవితంలో ఇది ఇంకొక గొప్ప విజయం.** ఈ విజయం వెనుక ఉన్నది కేవలము అమ్మవారే. ఈ పుస్తకానికి భారత్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ జై ఇండియన్ బుక్ ఆఫ్ ఇంటర్నేషనల్ రికార్డు లభించాయి. ఈ పుస్తకానికి గరిమళ్ళ సోమయాజుల శర్మగారు పీఠిక వ్రాశారు. దీన్ని కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతులు ఆవిష్కరించారు.

ఈ మధ్య కాలంలో **శ్రీవిద్యాసారథి** పేరుతో లలితా సహస్రనామ భాష్యము, **శ్రీవిద్యాలహరి** పేరుతో సౌందర్యలహరి, **శ్రీవిద్యా హృదయము** పేరుతో యోగినీ హృదయము, **శ్రీవిద్యా సర్వస్వము** పేరుతో కామకలావిలాసము, **భావనోపనిషత్తు** వంటి శ్రీవిద్యాపరమైన పుస్తకాలు వ్రాయటం జరిగింది. మాతృగర్భంలోకి శిశువు ఎలా ప్రవేశిస్తుంది? ప్రతినెలా ఏ రకంగా అభివృద్ధి చెందుతుంది? మొదలైన విషయాలన్నీ లలితా సహస్రంలో **విశుద్ధి చక్ర నిలయా, ఆ రక్తవర్ణా, త్రిలోచనా**

అనే నామం దగ్గర నుంచి వివరించబడ్డాయి. మాతృగర్భంలోకి శిశువు ఎలా ప్రవేశిస్తుంది. ఎలా వృద్ధి చెందుతుంది అనే విషయాలు ఋగ్వేదంలోని గర్భోపనిషత్తులో వివరించబడ్డాయి. ఈ విషయాల కోసం **గర్భోపనిషత్తు** కూడా ప్రచురించటం జరిగింది.

పంచదశీ మహామంత్రం ఎలా ఆవిర్భవించింది? మంత్రంలో ఎన్ని అక్షరాలుంటాయి అనే విషయాలు లలితా సహస్రంలో **శ్రీమద్వాగ్భవకూటైక ముఖపంకజా** నామం దగ్గర వివరించబడింది. పంచదశీ మహామంత్రాన్ని వివరిస్తూ భాస్కరరాయల వారు **వరివశ్యా రహస్యము** అనే పుస్తకం వ్రాశారు. దానికి సరియైన వ్యాఖ్య తెలుగులో లేదు. ఈ మంత్రానికి పదిహేను రకాల అర్థాలు వివరిస్తూ **వరివశ్యా రహస్యము** అనే పేరుతో నేను పుస్తకం వ్రాయటం జరిగింది. శ్రీవిద్యకు సంబంధించిన పుస్తకాలలో ఇదికూడా చాలా ముఖ్యమైనది.

శ్రీవిద్యాపరమైన పుస్తకాలతో పాటుగా **శ్రీకైవల్యసారథి** అనే పేరుతో శంకర భాష్యము, భట్టరు వారి భాష్యము, నిరుక్తము ప్రకారము అర్థము వివరిస్తూ లలితా సహస్రనామ భాష్యము వ్రాసిన మరుసటి సంవత్సరమే విష్ణు సహస్రనామ భాష్యము వ్రాయటం జరిగింది. ఈ పుస్తకాన్ని గండికోట రఘురామశర్మ గారి ఆర్థిక సహాయంతో ముద్రించటం జరిగింది. సౌందర్యలహరి ముద్రణకు కూడా వారే ఆర్థిక సహాయం చేశారు? లలితా, విష్ణు రెండు సహస్ర నామాలకి భాష్యం వ్రాసింది బహుశః నేను ఒక్కడినే.

ఇలా శ్రీవిద్యాపరమైన గ్రంథాలే కాకుండా **ద్వాదశదర్శనాలు, వేదాంత విద్యాసారథి** వంటి వేదాంత గ్రంథాలు కూడా వ్రాయటం జరిగింది. నాకు ఎప్పటి నుంచో శంకర భగవత్పాద విరచిత **మహావాక్యదర్పణము** తెలుగులో వ్రాయాలని కోరిక. 2009లో ఈ పుస్తకం వ్రాయటం ప్రారంభించాను. నలభై శ్లోకాలు వ్రాసిన తరువాత దాన్ని ప్రక్కన పెట్టటం జరిగింది. ఆ తరువాత చాలా కాలానికి 2016 ఫిబ్రవరిలో ఆ పుస్తకాన్ని తీసి పూర్తి చేశాను.

నాకు బాగా నచ్చిన ఆధ్యాత్మిక గ్రంథం **అష్టావక్రగీత.** దీన్ని కూడా అత్యంత సులభశైలిలో వ్రాయటం జరిగింది. అలాగే **దక్షిణామూర్తి స్తోత్రం** కూడా.

2014 జనవరిలో నా భార్య మరణించినప్పటి స్థితి నాకు మళ్ళీ 2018 ఫిబ్రవరిలో వచ్చింది. దాన్ని అసలు తట్టుకోలేకపోయాను. విపరీతంగా ఏడ్చేశాను. ఇంక బ్రతకటంచాలాకష్టం అనిపించింది. ప్రతిరోజు ఏడ్చేవాణ్ణి. ఎవరికీ చెప్పుకోలేను. ఏమిచెయ్యలేను. ఆ సమయంలోనే కేవలము రెండు నెలలో 13 కిలోల బరువు తగ్గానంటే, ఆ బాధ, దుఃఖము ఎంత బలంగా ఉన్నాయో ఊహించండి. అంత దుఃఖంలోను ఎలాగో స్థిరత్వం తెచ్చుకుని, మనసు దిటవు చేసుకుని **బ్రహ్మసత్యం-జగన్మిధ్యా** పుస్తకం వ్రాశాను వంద పేజీల పుస్తకమైంది. **పార్థసారథి గారు వ్రాసిన పుస్తకాలన్నింటిలోను ఇది నాకు చాలా బాగా నచ్చింది** అన్నారు శ్రీ గరిమళ్ళ సోమయాజులు గారు. జీవితం అంటేనే సుఖదుఃఖాల కలయిక. ఎవరికైనా సరే కేవలము సుఖాలు, లేకపోతే కేవలము దుఃఖాలే ఉండవు. సుఖదుఃఖాల కలయికే జీవితం. అష్టైశ్వర్యాలు, అష్టభోగాలతో పాటుగా అష్టకష్టాలు కూడా ఉంటాయి. జీవిత భాగస్వామి వియోగము అనేది అష్టకష్టాలలో ఒకటి. భర్త పోయిన భార్య తన జీవితాన్ని ఎలాగైనా గడపగలదు. కాని భార్యలేని భర్త జీవితంమాత్రం నరకప్రాయం. నా భార్య రమాదేవి 12-01-2014 ముక్కోటి ఏకాదశి దాటి ద్వాదశి గడియల్లో కాలం చేసింది. అప్పటి నుంచీ మొదలైంది దుర్భరమైన జీవితం. ఒక రకంగా చెప్పాలంటే ఇది జీవిత ఖైదు. 14 సంవత్సరాల ఖైదు కాదు. జీవించి ఉన్నంత కాలం విధించిన ఖైదు. అది కూడా అండర్ రూఫ్ సెల్‌లో. గదిశ్లాబు నాలుగు అడుగుల ఎత్తు ఉంటుందట. అందులో నుంచోటానికి వీలుండదు. ఎప్పుడూ కూర్చునే ఉండాలి. లేకపోతే పడుకోవాలి. మాట్లాడే వారుండరు. మనల్ని పట్టించుకునే వారు అంతకన్నా ఉండరు. భయంకరమైన ఒంటరితనం. భార్య మరణించిన వాడి పరిస్థితి కూడా అదే. కాలం గడవదు. పలకరించేవాళ్ళు, మాట్లాడేవాళ్ళు ఉండరు. గతంలోని ఆలోచనలు, జ్ఞాపకాలు. ఒక్కొక్కసారి విపరీతంగా దుఃఖం వస్తుంది. ఏడ్చేస్తుంటాం. "భగవంతుడా నన్ను కూడా ఎందుకు తీసుకుపోకూడదు? త్వరగా ఆపనిచెయ్యి" అని భగవంతుణ్ణి ప్రార్థిస్తుంటాం. అంతకన్న చెయ్యగలిగింది ఏదీ లేదు కంటికి కనిపించని, ఎప్పుడు వస్తుందో తెలియని మృత్యువుకోసం ఎదురు చూడటం తప్ప.

# 7. సి.డి.ల రూపంలో ఉపన్యాసాలు

శ్రీచక్రము, శ్రీవిద్యల గురించి బహుళ ప్రచారం చెయ్యాలని నా కోరిక. అది ఎలా సాధ్యం? ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. అప్పటికే మొదటి పుస్తకం **శ్రీవిద్యా దర్శనం** వ్రాయటం జరిగింది. అది చదివిన వాళ్ళందరూ చాలా గొప్ప విషయాలు అందులో చెప్పానని అనుకుంటున్నారు. దేవాదాయ ధర్మాదాయ శాఖ వారు ప్రచురించే **ఆరాధన** మాసపత్రికలో ఈ పుస్తకాన్ని సీరియల్‌గా వేశారు. ఆ రోజుల్లో ఆ పత్రికకు 'హరి' వారు ఎడిటరుగా ఉండేవారు. వీరు పుష్పగిరి ఆ స్థానంలో ఉండేవారు. చాలా గొప్ప పండితులు వారు కూడా ఈ పుస్తకాన్ని మెచ్చుకుని, "ఈ విషయాలు ఇలా బయటకు రావటం ఇదే మొదటిసారి. ఇవి ఎక్కువ మందికి తెలిస్తే బాగుండు అనే ఉద్దేశ్యంతోనే పత్రికలో ప్రచురిస్తున్నాము" అన్నారు. విషయం బహుళ ప్రచారం కావాలంటే ఏం చెయ్యాలో నాకు అర్థం కాలేదు. నాకు మ్యాన్‌పవరు, మనీపవరు రెండూ లేవు. అంటే నా గురించి, పుస్తకాల గురించి ప్రచారం చేసేందుకు అభిమానులు లేరు. పోనీ ఇంకేమైనా చేద్దాం అంటే చాలినంత ధనం లేదు. ఏం చెయ్యాలి? అని ఆలోచిస్తున్న సమయంలో విజయవాడలో మా ఇంటి దగ్గర 'రామకోటి' (శివరామకృష్ణక్షేత్రము) ఉంది. అందులో ప్రతిరోజు ఆధ్యాత్మిక ఉపన్యాసాలు జరుగుతాయి. బెజవాడ రామశేషయ్య గారు ఆ విషయాలు చూసేవారు. అక్కడ ఉపన్యాసం చెప్పటానికి పెద్దపెద్దవాళ్ళనే పిలిచేవారు. నాబోటివాళ్ళ ముఖం కూడా చూసేవారు కాదు. 1995 సం॥లో ఒకరోజున రామశేషయ్య గారి దగ్గర నుంచి కబురు వచ్చింది. 'శ్రీవిద్య మీద ఒక వారం రోజులు ఉపన్యాసం చెబుతారా'? అని. ఎగిరి గంతేశాను. ఆడబోయిన తీర్థం ఎదురయింది. నాకు బల్లమీద కూర్చుని ఉపన్యాసం చెప్పాలని తీవ్రమైన కోరిక. ఆ కోరిక తీరబోతోంది. వారం రోజులపాటు అక్కడ ఉపన్యాసాలు చెప్పాను. చాలాబాగుంది అన్నారు ఇంతవరకు ఇటువంటి ఉపన్యాసం ఎవరూ చెప్పలేదు అన్నారు. రామాయణ, భారత, భాగవతాలు తప్ప ఈ విషయాన్ని ఎవరూ ఇంతవరకు ముట్టుకోలేదు అన్నారు. మొత్తం మీద ఉపన్యాసం చాలా బాగుంది. ఆఖరు రోజున సన్మానం చేశారు. బట్టలు పెట్టి **వెయ్యి రూపాయలు** ఇచ్చారు. **ఇది నా మొదటి ఉపన్యాసం.** చిన్నప్పుడు కంభంపాటి రామ్మూర్తి శాస్త్రి గారిని చూసి నేను కన్నకల ఈ రోజు నిజమైంది. ఉపన్యాసం బాగుంది అని

ఇంతమంది మెచ్చుకున్నారు కదా. ఇది ఇంకా ఎక్కువ మందికి విషయం చేరితే ఎలా ఉంటుంది? ఆలోచన బాగానే ఉంది. కాని ఎలా చేరుతుంది.

తరువాత కొన్ని రోజులకు టిటిడి కళ్యాణమంటపంలో చినజియరు స్వామివారి ఉపన్యాసాలు జరుగుతున్నాయి. ఒకరోజు నేను కూడా వెళ్ళాను. బయట స్వామివారు చెప్పిన ఉపన్యాసాలు క్యాసెట్లు అమ్ముతున్నారు. చాలామంది వాటిని కొంటున్నారు. ఎందుకు ఇవి? అని వాళ్ళని అడిగాను. "స్వామివారు ఉపన్యాసం ఎప్పుడు పడితే అప్పుడు చెప్పరు కదా? క్యాసెట్టు తీసుకువెడితే ఎప్పుడు కావాలంటే అప్పుడు వినచ్చు. పైగా ప్రతిసారి ఇంత దూరం రానవసరం లేదు. అక్కడ మేం పదిమంది కూచుని క్యాసెట్ పెట్టుకుని వినచ్చు. ఎక్కడెక్కడి వాళ్లు కూడా క్యాసెట్ తీసుకువెళ్ళి వినచ్చు కదా? విషయం బహుళ ప్రచారం అవుతుంది" అన్నారు. నాకు కావాలసిన ప్రశ్నకు అనుకోకుండా సమాధానం దొరికింది. ఈ రకంగా నా ప్రశ్నలకు, సందేహాలకు ఒకటి రెండుసార్లు చినజీయరు స్వామివారి వల్లనే సమాధానాలు దొరికాయి పరోక్షంగా. ఉపన్యాసాలను క్యాసెట్ల రూపంలోకి తెస్తే ఎక్కువ ప్రచారం జరుగుతుంది. రికార్డింగ్ చెయ్యటానికి ఒక స్టూడియో వెతుక్కుని ఆ పుస్తకంలో వ్రాసిన విషయమంతా నాలుగు గంటలు ఉపన్యాసం చెప్పి రికార్డు చేశాను. మాస్టర్ క్యాసెట్ బయటకు వచ్చింది. దీనికి రూ. 1500/– ఖర్చయింది. అది చాలా ఎక్కువ మొత్తమే. మొన్న రామకోటిలో ఇచ్చిన వెయ్యి రూపాయలు, ఇంట్లో నా భార్యకు తెలియకుండా రూ. 500/– ఇచ్చేశాను. మా రమాదేవికి మాత్రం రికార్డింగ్‌కి వెయ్యి రూపాయలు అయింది అని అబద్ధం చెప్పాను. ఇప్పుడు వాటిని కాపీలు తీయించాలి. నాలుగు క్యాసెట్లు. ఒక్కొక్క క్యాసెట్ కాపీ చేస్తే రూ. 8/– తీసుకుంటాడు. 4×8 = 32 రూ.కు ఒక సెట్టు వస్తుంది. అలా వంద కాపీలు తీయించాను. ఇవి జేబులో డబ్బులే ఇంట్లో తెలియదు. మళ్ళీ రామకోటిలో ఉపన్యాసానికి రమ్మన్నారు. వెళ్ళాను. రూ. 20/–కు నాలుగు క్యాసెట్ల సెట్లు ఇచ్చేశాను. మీకు నష్టం వస్తుంది కదా? అన్నారు. నేను లాభం కోసం ఈ పని చెయ్యటం లేదు. ఇక్కడ మీరిచ్చే డబ్బులన్నీ దీని కోసమే ఖర్చు పెడతాను అని చెప్పి, తరువాత వెయ్యి సెట్లు కాపీలు తీయించాను. వీటిలో ఉచితంగా పంచినవే చాలా ఉన్నాయి. కొంతమంది వచ్చి మేం కూడా వింటాం అని అడిగేవాళ్ళు. వాళ్ళందరికీ ఉచితంగానే ఇచ్చేశాను. ఇలా ప్రారంభమైంది నా ఉపన్యాస కార్యక్రమము. అంతా చేతిచమురు భాగవతమే.

మీ వాయిస్ చాలా బాగుంటుంది. ఖంగు మంటుంది. కమాండింగ్‌గా ఉంటుంది. శ్రోతని నిలబెట్టి మరీ వినేట్టు చేస్తుంది. కాబట్టి ఇంకా కొన్ని ఉపన్యాసాలు క్యాసెట్లుగా ఇవ్వండి అన్నారు. పొగడ్తలకు లొంగని వాడెవడు? జేబులో డబ్బులు ఖర్చు పెట్టుకుని మరీ రికార్డింగ్ చేశాను. ఈ మధ్యలో లలితా సహస్రనామ పుస్తకం వచ్చింది. అది కూడా క్యాసెట్‌గా విడుదల చెయ్యాలని కోరిక. **'కళాదర్శని'** రికార్డింగ్ స్టూడియో. అది ఆర్.సి.యం. చర్చికి సంబంధించినది. అక్కడ లలితా సహస్రం రికార్డు చేశాను. 24 గం॥ వచ్చింది. అప్పుడే క్రొత్తగా ఇలాంటి విషయం మీద సి.డి.లు వాడకంలోకి వస్తున్నాయి. అందుకని లలితాసహస్రం సిడిగా చేశాను. రెండు డివిడిలు అయింది. రూ. 24,000/- బిల్లు అయింది. మాష్టరు సిడి విశ్వా **ఇన్ఫోటెక్** వారికి ఇచ్చాను. కాపీలు వాళ్ళు అమ్ముకున్నారు. ఇందులో నాకు వచ్చింది రికార్డు చెయ్యటానికి శ్రమ, రూ. 24,000 బిల్లు అంతే. ఎవరమ్మినా సిడిలు నా పేరు మీదనే ఉన్నాయి. పేరు నాదే కదా? అని సర్ది చెప్పుకున్నాను.

2005లో గణపతి సచ్చిదానంద స్వామి వారు ఆస్థాన విద్వాంసుడుగా నియమించి రూ. 10,000/- ఇచ్చారు. వాటికి ఇంకొక రూ. 5000 కలిపి **సౌందర్యలహరి, సప్తశతిభాష్యము** సిడిలుగా చేసి స్వామి వారికి సమర్పించాను.

ఒకసారి రామాయణం మీద ఉపన్యాసం చెప్పాలనిపించింది. ఎంత సమయం పడుతుంది? ఎన్ని గంటలు అవుతుంది? అని అడిగారు. తెలియదు అన్నాను. సరే ఉపన్యాసం ప్రారంభించాలి. స్టూడియోకి వెడితే డబ్బులు ఖర్చు ఎక్కువ వాచిపోతున్నాయి. అందుకని మైక్‌సెట్టు కొని ఇంట్లోనే రికార్డింగ్ చేస్తే ఎలా ఉంటుంది? అనే ఆలోచన వచ్చింది. విజయవాడలో ప్రముఖ వ్యక్తి **శ్రీ కాండూరు ఉమామహేశ్వరుడు** గారు రికార్డింగ్‌కు కావలసిన మైకు, రికార్డరు, యాంప్లిఫైరు. అన్నీ కొనిచ్చారు. అప్పుడు రామాయణం రికార్డింగ్ మొదలుపెట్టాను. రామాయణం చాలామంది చెబుతారు. వారికన్నా విలక్షణంగా ఉండాలి అని భావించి వాల్మీకి రామాయణాన్ని ఆధారంగా తీసుకుని అందులోని సన్నివేశాలు ఎక్కడ? ఎవరు? ఎలా మార్చారు? అనే విషయాలు చెప్పటం మొదలు పెట్టాను. మొత్తం 15 రకాల రామాయణాలు ఉదహరించాను. బాలకాండ పూర్తయింది 16 గం॥ వచ్చింది నాకు నచ్చలా. మళ్ళీ రికార్డు చేశాను 20 గం॥ వచ్చింది. అదీ అంతగా బాగా

లేదనిపించింది. ఈసారి గట్టి సంకల్పంతో చేశాను. 24 గం॥ వచ్చింది. ఇది బాగుంది. అలాగే మిగిలిన ఐదుకాండలు రికార్డింగ్ చెయ్యాలంటే సౌండ్ ప్రూఫ్ గది కావాలి. అది స్టూడియోలో ఉంటుంది. దానికి అద్దె కట్టాలి. నా దగ్గర డబ్బులు లేవు. అందుకని గది తలుపులు వేసుకుని రికార్డింగ్ చేసేవాణ్ణి. అప్పుడు గాలి లోపలికి రాక వళ్ళంతా చెమటతో తడిసిపోయేది. ఒకసారి రికార్డింగ్ చేసి బయటకు వస్తున్న సమయంలో తెనాలికి చెందిన బిల్డరు **కనగాల హరిప్రసాదు** గారు వచ్చారు. వారికి నా ఉపన్యాసాలంటే చాలా ఇష్టం. అన్ని ఉపన్యాసాలు విన్నారు. నన్ను చూసి స్నానం చేసి వస్తున్నారా? అన్నారు. అని అడిగారు. రికార్డింగ్ సమయంలో గదిలోకి ఇతర శబ్దాలు రాకుండా, తలుపులు వేసేస్తాను. అని చెప్పాను. ఆ నా పరిస్థితి చూసి చాలా బాధ పడ్డారు. మీరు ఇంత కష్టపడి రికార్డు చేస్తే మేం ఫ్రీగా వినేస్తున్నామా? అన్నారు. వెంటనే ఎసి తెప్పించి రికార్డింగ్ రూమ్‌లో బిగించారు. అప్పటి నుంచి, వారి పుణ్యమా అని ఉపన్యాసాలు రికార్డు చెయ్యటం కొంత తేలిక అయింది. తరువాత కాలంలో హరిప్రసాదు గారు బ్రహ్మసత్యం-జగన్మిథ్యా పుస్తకాలు 1000 కాపీలు తీసుకుని, వారి తండ్రిగారు కనకాల కృష్ణారావు గారి జ్ఞాపకార్థం పంచి పెట్టారు కూడా. మొత్తం **శ్రీమద్రామాయణం 171 గం॥** రికార్డయింది. **ది ఎవరెస్ట్ వరల్డ్ రికార్డు ప్రపంచ రికార్డుగా నమోదయింది.** ఇదే నా మొదటి ప్రపంచ రికార్డు. ఈ రకంగా నేను చెప్పిన ఉపన్యాసాలు ప్రారంభమయినాయి. ఈ కాలంలోనే విష్ణుసహస్రనామము, వేదాంత పంచదశి విద్యారణ్యుల వారు వ్రాసినది నేను అమెరికాలో ఉన్నప్పుడు ఈ ఉపన్యాసం చెప్పాను. అక్కడ వాళ్ళు రూ. 16,000/-తో రికార్డరు కొనిచ్చారు. అందులో రికార్డు చేసి కంప్యూటరులోకి ఎక్కించటమే. ఇంకా క్యాసెట్లు అవసరంలేదు. దీంతో రికార్డింగ్ కార్యక్రమము చాలావరకు తేలిక అయింది. ఇలా చేస్తే సమయము ఖర్చు కూడా ఆదా అవుతాయి. అందుకని అక్కడ నుంచి క్యాసెట్ రికార్డరు వదిలేసి సిడిలు చెయ్యటం మొదలుపెట్టాను. 2010 మార్చిలో **ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్,** అమెరికాలోని మెంఫిస్ నగరంలో ఉంది. వారు అక్కడ దేవాలయంలో శ్రీచక్రప్రతిష్ఠ చేస్తున్నారు. దాని సందర్భంగా నన్ను అక్కడకు తీసుకువెళ్ళారు. అక్కడే నేను కొన్ని ఉపన్యాసాలు చెప్పి రికార్డు చేశాను. వాటిలో **వేదాంత పంచదశి** ఒకటి. ఇది విజయనగర సామ్రాజ్యాన్ని

స్థాపించిన విద్యారణ్యుడు వ్రాసినది. ఒకరోజు గదిలో కూర్చుని ఉపన్యాసం చెబుతున్నాను. నేను సోఫాలో కూర్చున్నాను. ఎదురుగా టీపాయి మీద రికార్డరు, పుస్తకము ఉన్నాయి. గదిలో ఇంకెవరూ లేరు. ఉపన్యాసం సాగుతోంది. ఇంతలో ఎవరో తల ముందుకు వంచి పుస్తకంలోకి చూస్తున్నారు. ఎవరది? అనుకుని చిరాకుపడి తలప్రక్కకు తిప్పాను. ఒకాయన నా ప్రక్కన కూర్చుని ఉన్నాడు. జేగురు రంగు వస్త్రాలు ధరించాడు. చూడగానే సన్యాసి అని తెలుస్తోంది. అయితే ఆయన ధరించిన దుస్తులు సంప్రదాయ సన్యాసులు ధరించేవిగా ఉన్నాయి. భుజాల మీద బట్ట ముడివేశాడు. క్రింద పిక్కలదాకా ఉన్నాయి వస్త్రాలు. సుమారు నెలరోజులయి ఉంటుంది గుండు గీయించి. నెత్తిన జుట్టు, గడ్డము కొద్దిగా మొలకెత్తుతున్నాయి. జుట్టంతా నల్లగా ఉంది. మనిషి కూడా రంగు తక్కువగానే ఉన్నాడు. నా ప్రక్కనే కూర్చుని ఉన్నాడు. మరీ సన్నగా కాకపోయినా లావుగా మాత్రం లేడు. ఎవరోలే అని నేను కూడా పెద్దగా పట్టించుకోలా. ఉపన్యాసంలో లీనమై పోయాను. కొంతసేపటి తరువాత ప్రక్కకి తిరిగి చూశాను. ఎవరూ లేరు. గదిలో నేనొక్కడినే ఉన్నాను. జరిగిందంతా అర్థమయింది. ఆ వచ్చింది ఎవరో కాదు 'సాక్షాత్తు విద్యారణ్యులు' వారు వ్రాసిన వేదాంత పంచదశి అద్వైత సిద్ధాంతము. దీన్ని ఉపన్యాసంగా చెప్పాలంటే ఒక పట్టాన అర్థంకాదు. ఎవరూ దాన్ని ఉపన్యాసాలుగా కూడా చెప్పరు. అటువంటిది నేను దీన్ని ఉపన్యాసాలుగా ఇస్తున్నాను. అందుకని సాక్షాత్తు విద్యారణ్యులవారే వచ్చి చూసివెళ్ళారు. **ఈ రకంగా ఆ రోజున విద్యారణ్యుల వారి దర్శనం అయింది నాకు.**

చిన్న చితక విషయాలు వదిలేస్తే గొప్ప విషయం ఇంకోటుంది. నేను ఒక గ్రంథావిష్కరణకు వెళ్ళాను. పటమటలోని గణపతి స్వామివారి ఆశ్రమం. రాత్రి 7.30 గం॥ నా గ్రంథం ఆవిష్కరణ జరగాలి. ఇంతలో కుప్పా కృష్ణమూర్తి గారు వచ్చారు. వారు వ్రాసిన గ్రంథం ముందు ఆవిష్కరించి, తరువాత నా గ్రంథావిష్కరణ చేస్తాను అన్నారు స్వామి. కృష్ణమూర్తి గారు వ్రాసినది **'ఆత్మదానము'** అనే పుస్తకము దీన్ని గతంలో స్వామిజీ ఉపన్యాసాలుగా చెప్పారు. ఆ ఉపన్యాసాలన్నీ కలిపి ఇప్పుడు పుస్తకంగా వేశారు. ఆవిష్కరణ తరువాత స్వామిజీ నన్ను పిలిచి ఒక పుస్తకం నా చేతికి ఇచ్చారు. నేను అక్కడే ఒకసారి పుస్తకాన్ని ఈ చివర నుంచి ఆ చివరకు

తిరగేశాను. 300 పేజీల పుస్తకం. 'స్వామీ ! ఈ పుస్తకాన్ని నేను రికార్డు చెయ్యవచ్చునా?' అన్నాను. వెంటనే స్వామీజీ కృష్ణమూర్తి గారిని, ఆశ్రమం మేనేజరు ప్రసాదుగారిని పిలిచి 'పార్థసారథి గారు ఈ పుస్తకాన్ని ఉపన్యాసాలుగా చెప్పి సిడి చేస్తారట' అన్నారు. 'చెయ్యమనండి' అన్నారు వాళ్ళు. సరే పుస్తకం తీసుకుని వచ్చేశాను. దాన్ని ఉపన్యాసాలుగా చెబుదామని పుస్తకం తీసి చూశాను. చెప్పటం ప్రారంభించాను. ఇప్పుడు రికార్డింగ్ అంతా మా ఇంట్లోనే జరుగుతోంది. రికార్డింగ్ ప్రారంభించాను. దత్తాత్రేయుడు పుట్టకముందు నుంచి, అంటే అత్రిమహర్షి, అనసూయాదేవిలు వివాహ పూర్వం నుంచీ దత్తాత్రేయుడు జన్మించేదాకా ఉంటుంది ఆ పుస్తకంలో. చెప్పటం ప్రారంభించాను. అత్రి మహర్షికి వివాహమైంది. ఆశ్రమానికి కొద్ది దూరంలో నది ఉన్నది. నదికి వెళ్ళి స్నానం చేసి వస్తాడు మహర్షి ప్రతిరోజు. దారంతా రాళ్ళు, ముళ్ళు ఉంటాయి. కాళ్ళన్నీ బొబ్బలెక్కి పుండ్లుపడి ఉంటాయి. ఒకరోజు నారదుడు ఆశ్రమానికి వచ్చి కాళ్ళు ఇలా ఎందుకున్నాయి అని అడుగుతాడు. విషయం చెబుతాడు మహర్షి. ఆ దారంతా బాగుచేస్తే బాగుండును. కాని ఎవరు చేస్తారు? అంటాడు మహర్షి. ఆ మరునాడు దారి బాగుచేసి ఉంటుంది. ఎవరు బాగుచేశారు? అంటే మా వదినగారే ఇంకెవరు చేస్తారు? అంటాడు నారదుడు.

ఈ విషయాలు చెబుతున్నప్పుడు ఆశ్రమంలో అత్రిమహర్షి పాదాలకు దెబ్బలు తగలటం, నారదుడు మాట్లాడటం, అనసూయాదేవి చీపురుతో దారి అంతా శుభ్రం చెయ్యటం అంతా నేను ప్రత్యక్షంగా చూస్తూ ఉన్నాను. జరుగుతున్న విషయమంతా చూస్తూ చెబుతున్నాను.

అత్రిమహర్షి పరమేశ్వర సాక్షాత్కారం కోసం తపస్సు చేస్తాడు. ఆ సమయంలో మోకాళ్ళ వరకు తెల్లని పంచె కట్టుకుని, నడుముకు ఎర్ర తువాలు కట్టుకుని కుడికాలు నేలమీద ఉంచి, ఎడమకాలు కుడిమోకాలు దగ్గర ఉంచి, రెండు చేతులు పైకెత్తి నమస్కారం చేస్తూ తపస్సు చేస్తున్నాడు. అనసూయాదేవి దగ్గరలోనే ఒక చెట్టుకు ఆనుకుని, కుడికాలు చెట్టుకు ఆనించి, ఎడమకాలి మీద నుంచుని ఉంది. ఆకుపచ్చని చీరె. ఎర్రబార్డరు కాశాపోసి కట్టుకుంది. చీరె మోకాళ్ళ క్రింది వరకు ఉంది. కొంగు నడుంచుట్టూ త్రిప్పి దోపుకుంది. తెల్లని జాకెట్టు వేసుకుంది. రెండు చేతులు కట్టుకుని, మహర్షి సమాధిలోంచి ఎప్పుడు లేస్తాడో, ఏ సపర్యలు కావాలో అని అందించటానికి సిద్ధంగా నుంచుని ఉంది. ఇదంతా నా కళ్ళతో నేను చూస్తున్నాను.

దత్తుడు పుట్టకముందు అనసూయాదేవికి దర్శనమిస్తాడు. రారా నాయనా ! అంటుంది. అనయసూయాదేవి. చిన్న పిల్లవాడు. సంవత్సరం వయసున్న వాడు. తెల్లని పట్టు పంచె కట్టుకుని, మెడలో ముత్యాల, రతనాల హారాలు, నెత్తిన కిరీటం, ముఖాన కస్తూరితిలకం, బుగ్గనచుక్క, చేతులకు కంకణాలు, నడుముకు వడ్డాణం, భుజకీర్తులు, వ్రేళ్ళకు ఉంగరాలు, చేతిలో మురళి. బుడి బుడి అడుగులతో పరుగున వస్తాడు అనసూయ దగ్గరకు. ఇదంతా నేను చూస్తూ చెప్పాను. ఆ ఉపన్యాసం చెప్పే సమయంలో ఇదంతా నేను ప్రత్యక్షంగా దర్శించి చెప్పాను. కళ్ళు మూసుకుంటే ఇప్పుడు కూడా ఆ దృశ్యం కంటికి కనిపిస్తుంది. ఆ మాటే స్వామివారికి కూడా చెప్పాను. అది చాలా గొప్ప పుస్తకం, అతిగొప్ప ఉపన్యాసం. కొంతమంది భక్తులు కూడా ఆ సిడిని విని అదే అనుభూతిని పొందారు.

వీటన్నింటికన్నా అతిగొప్పదైనది స్వామివారి జీవిత చరిత్ర. 2007 జనవరి రెండవ తారీకు రాత్రి తొమ్మిది గంటల సమయం. నేను వ్రాసిన సౌందర్యలహరి పుస్తకం ఆవిష్కరణ జరిగింది పటమట ఆశ్రమంలో. తరువాత స్వామివారు నన్ను పిలిచి 'స్వామిజీ జీవిత చరిత్ర చెబుతారా?' అని అడిగారు. మహద్భాగ్యం. అంతకన్న కావలసింది ఏముంది? తప్పకుండా చెబుతాను అన్నాను. 1600 పేజీల పుస్తకం చెప్పటానికి ఎంత కాలం పడుతుంది? అన్నారు. నేను లెక్క వేసుకుని మూడు నెలలు సమయం పడుతుంది స్వామీ. మార్చి 31 కల్లా మీకు సిడి ఇచ్చేస్తాను అన్నాను. అంతేనా అయితే స్వామిజీ పుట్టినరోజున సిడిని ఆవిష్కరిద్దాం అన్నారు అలాగే స్వామీ ! అన్నాను. అయితే ఈ మాట అందరికీ చెప్పనా? అన్నారు స్వామిజీ చెప్పండి స్వామీ అన్నాను. వెంటనే మైకు తీసుకుని "స్వామిజీ జీవిత చరిత్ర చెప్పి పార్థసారథి గారు సిడి చేస్తానన్నారు. జీవిత చరిత్ర చెబుతామని చాలామంది నా దగ్గరకు వచ్చారు. మీరు కాదు. దీన్ని చెప్పేవారు వేరే ఉన్నారు. వారే ఇక్కడికి వస్తారు అని చెప్పాను. ఇదిగో ఇప్పుడు పార్థసారథి గారు వచ్చారు. వీరు జీవిత చరిత్ర చెబుతారు. మే నెల 25 స్వామిజీ పుట్టిన రోజున సి.డి ఆవిష్కృతమవుతుంది" అని చెప్పారు.

స్వామిజీ జీవిత చరిత్ర పుస్తకం ఒకటి ఇప్పించారు. తరువాత దాన్ని సిడిగా చేసి ఏప్రియల్ ఒకటవ తారీకున వారికి అందించాను అనుకున్నట్లుగానే స్వామిజీ

పుట్టిన రోజున సి డి ఆవిష్కృతమైంది. ఆ సభలో (నన్ను) ఘనంగా సత్కారం చేశారు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే అదంతా అనుభూతి పొందుతూ చెప్పిన సిడి. మామూలుగా చెప్పిన ఉపన్యాసాలకి, జీవితచరిత్ర చెప్పిన దానికి గొంతులో కూడా చాలా తేడా ఉంటుంది. జీవిత చరిత్ర మొత్తం చాలా మధురమైన ధ్వనిగా (స్వీట్ వాయస్‌గా) ఉంటుంది. మిగిలిన ఉపన్యాసాలు ఖంగుమంటాయి. అలా స్వామీజీ జీవిత చరిత్ర చెప్పటం ఒక గొప్ప అనుభూతి. అనిర్వచనీయం, అనుభవైక వేద్యం సన్నివేశాలన్నీ నా కళ్ళతో చూస్తూ చెప్పాను. చాలా గొప్ప అనుభవం.

2002లో లలితా సహస్రనామ బాష్యం వ్రాయటం జరిగింది. ఆ పుస్తకాన్ని స్వామి వారికి సమర్పించటానికి మధ్యాహ్నం 12 గం॥ రమ్మన్నారు. నేను, మా రమాదేవి ఇద్దరం వెళ్ళాం. ఆ రోజు ఏదో పూజలు చేసి అందరికి రక్ష ఇస్తున్నారు. జనం అంతా వరుసలో వస్తున్నారు. మేము అక్కడే కూర్చున్నాం. టైము ఒంటిగంట అయింది. స్వామి చాలా బిజీగా ఉన్నారు. స్టేజి దిగి వెళ్ళిపోయారు. నేను వెళ్ళిపోయి మరునాడు వస్తాను అన్నాను. నిర్మలాచౌదరి గారు 'ఒక్కసారి ఉండండి స్వామి చాలా బిజీగా ఉన్నారు అక్కడ హోమం జరుగుతోంది. పూర్ణాహుతికి వెళ్ళారు. అక్కడ ఏమైనా వీలవుతుందేమే చూద్దాం' అన్నారు. **నిర్మలాచౌదరి గారు స్టెల్లా కాలేజి లెక్చరరు.** ఆశ్రమంలో నాకు గాడ్ ఫాదరు. నా గ్రంథాల ఆవిష్కరణ అంతా వారే చూస్తారు. వారే లేకపోతే స్వామీజీ దగ్గర నా పనులు జరిగేవి కాదేమో? సరే హోమకుండం దగ్గరకు వెళ్ళాం. 'స్వామీజీ రమ్మంటున్నారు' అన్నారు. నేను, రమాదేవి, నిర్మలాచౌదరి గారు ముగ్గురం వెళ్ళాం. నన్ను చూడగానే 'చాలాసేపటి నుంచి ఎదురు చూస్తున్నాను నీ కోసం' అన్నారు. లలితా సహస్రనామ భాస్యం పుస్తకం, దాని మీద నేను చేసిన 24 గం॥ సిడి రెండూ ఇచ్చాను. అంత బిజీలోనూ కుర్చీలో తీరుబడిగా కూర్చుని పుస్తకం చూశారు. చాలాబాగుంది. గొప్ప పని చేశారు అన్నారు. వారి బుజం మీద ఉన్న ఎర్ర శాలువ తీసి నాకు కప్పారు. నేను ఇవతలకి వస్తూ చూశాను. మా రమాదేవికి బట్టలు పెట్టారు. పది అడుగులు వేశానో లేదో. స్వామీజీ పిలుస్తున్నారు అన్నారు. తిరిగి వెనక్కి వచ్చాం. స్వామి తన బుజం మీద ఉన్న ఉత్తరీయం మీద చేత్తో రాస్తున్నారు. 'స్వామీజీ మీకు ఏదో ఇవ్వాలనుకుంటున్నారు' అన్నారు. నిర్మలా మేడమ్. ఏమిస్తారు? విబూది, కుంకుమ

అంతేకదా అనుకున్నాను. 'చెయ్యి పట్టు' అన్నారు స్వామి. దోసిట పట్టాను. నా కుడిచెయ్యి ఉంగరపు వేలు తీసుకుని ఉంగరం తొడిగారు. నవరత్నాల ఉంగరం బహూకరించారు. సౌందర్యలహరి ఆవిష్కరణ సమయంలో బంగారు శ్రీచక్రం ఇంకొక సందర్భంలో బంగారు లక్ష్మీదేవి డాలరు ఇచ్చి సత్కరించారు. స్వామీజీ దగ్గరకు వెళ్ళిన ప్రతిసారీ నిర్మలాచౌదరి గారే కార్యక్రమం చూసేవారు. 2004లో నేను చేసిన సిడిలు 1.లలితా సహస్రనామ భాష్యము 2. సౌందర్యలహరి 3. సప్తశతి భాష్యము. ఈ మూడు స్వామివారికి ఇచ్చేశాను. వాటిమీద సర్వహక్కులు స్వామి వారివే. వాటిని ఆశ్రమం తరుపున అమ్ముతారు. నాకు వారి దగ్గర నుంచి పైసా కూడా అవసరం లేదు. ఆ సిడిలు కాపీ తీయించి 28-5-2005న ఆవిష్కరణ చేస్తాం. మీరు మైసూరు ఆశ్రమానికి రండి అన్నారు. సరే నేను నా భార్య రమాదేవి ఇద్దరం మైసూరు వెళ్ళాం. అవి స్వామీజీ జన్మదిన వేడుకలు. ఆ వేడుకలు మొత్తం మూడు రోజులు జరుగుతాయి. అందులో భాగంగా రెండవ రోజున సిడిల ఆవిష్కరణ జరిగింది. ఆ రోజు సాయంత్రం నేను బయలుదేరతాను అన్నాను. 'రేపు కూడా సభ ఉంది. మీరు తప్పకుండా ఉండండి' అన్నారు. అయిష్టంగా ఉన్నా స్వామి వారి మాట కాదనలేక సరే అన్నాను. 29-5-2005న ఉదయం 8.30 గం॥కు చాలా పెద్ద సభ జరిగింది. దానికి కర్ణాటక గవర్నర్ గౌ॥ శ్రీ టి.ఎన్.చతుర్వేది. గుజరాత్ గవర్నరు గౌ॥ శ్రీ నావల్ కిషోర్ శర్మ మైసూర్ మేయరు అతిథులుగా వచ్చారు. సభ ప్రారంభానికి అరగంట ముందే, వెంటనే రమ్మని నాకు కబురు పెట్టారు. నేను బయలుదేరేలోపే మూడు కబుర్లు వచ్చాయి. నేను వెళ్ళగానే స్టేజి ప్రక్కన ఉన్న గదిలోకి తీసుకువెళ్లారు. అక్కడ గుజరాత్ గవర్నరు, స్వామీజీ కూర్చుని ఉన్నారు. దత్తపీఠ ఆస్థాన విద్యాధికారి శ్రీ కుప్పా కృష్ణమూర్తి గారు కొంతమంది పండితుల్ని గవర్నరు గారికి పరిచయం చేస్తున్నారు. నన్ను కూడా లోపలికి పిలిచారు. కృష్ణమూర్తి గారు నా గురించి చెప్పబోయారు. స్వామీజీ వారిని ఆపేసి నన్ను దగ్గరకు రమ్మని, నా నడుంచుట్టూ చెయ్యి వేసి ఎంతో అప్యాయతతో దగ్గరకు తీసుకుని స్వయంగా నన్ను గవర్నరు గారికి పరిచయం చేశారు. ఆ తరువాత సభ ప్రారంభమయింది. ఆ రోజున కొంతమందిని ఆస్థాన విద్వాంసులుగా నియమిస్తున్నారు. కొంతమందిని నిధి పురస్కారంతో సత్కరిస్తారు. సన్మాన

గ్రహీతలందర్నీ స్టేజి మీదికి పిలుస్తున్నారు. ముందు నిధి పురస్కార గ్రహీతలని పిలిచారు. ఆ తరువాత ఆస్థాన విద్వాంసులుగా నియమింపబడే వారిని పిలిచారు. విచిత్రం ఏమంటే ఆస్థాన విద్వాంసులుగా నియమింపబడే వారిలో మొదటివాణ్ణి నేనే. ముందుగా నా పేరే పిలిచారు. నేను చాలా ఆశ్చర్యపోయాను. ఎందుకంటే సన్మాన గ్రహీతలందరి పేర్లతోను ఆహ్వాన పత్రిక ముందుగానే వచ్చింది. 'దాంట్లో నా పేరు లేదు. ఇప్పుడు మాత్రం నన్ను పైకి నిలిచారు. ఎందుకని?' అని తరువాత స్వామివారినే అడిగాను.' నీకు చెప్పకుండా, ఒక్కసారిగా ఆశ్చర్యచకితులుగా చేద్దామని మేము ఇలా చేశాం' అన్నారు స్వామిజీ. మైసూరు ఆశ్రమంలో నాదమంటపము అంటే ఆడిటోరియం. చాలా పెద్దది. కేవలము వైశాల్యంలోనే కాదు అక్కడ స్టేజీ ఎక్కాలంటే వాళ్ళు చాలా గొప్పవారై ఉండాలి. అటువంటి నాదమంటపంలో 29-5-2005 ఇద్దరు గవర్నర్ల చేతులమీదుగా సన్మానం జరిపించి నన్ను దగ్గరకు తీసుకుని నా చేతికి ఆస్థాన విద్వాంసుడుగా నియమాక పత్రాన్ని అందించారు స్వామిజీ. **ఇది నా జీవితంలో మరువలేని, మరపురాని రోజు.** మా రమాదేవి కూడా సన్మాన కార్యక్రమాన్ని ప్రత్యక్షంగా చూసి ఆనందించింది. అదే వేదిక మీద వరుసగా మూడు సంవత్సరాలు నాకు సత్కారం జరిగింది. **2004లో రాష్ట్రప్రభుత్వం తారణ నామ సంవత్సర ఉగాది పురస్కారము, ఉత్తమ అధ్యాయ అవార్డులతో** సత్కరించింది. 2017 సం॥ వైశాఖ మాసం చివరలో నేను దేవతార్చనలో ఉన్నాను. ఆ సమయంలో ప్రక్కనే ఉన్నా సెల్ మ్రోగింది. మేము మైసూరు ఆశ్రమం నుంచి మాట్లాడుతున్నాము అన్నారు. నమస్కారం. చెప్పండి ఉన్నాను. ఆషాఢ పౌర్ణమికి (గురుపూర్ణిమ) మిమ్మల్ని సత్కరించాలి అనుకుంటున్నారు స్వామిజీ మీరు అనుమతిస్తే సత్కారం చేస్తాము' అన్నారు. సాక్షాత్తు స్వామి వారు అనుగ్రహించి సత్కరిస్తానంటే, అడగకుండానే భగవంతుడు వరమిస్తానంటే కాదనేదేముంది. మహద్భాగ్యము.

**శరీరం సురూపం తథావా కళత్రం యశశ్చారు చిత్రం ధనం మేరుతుల్యం।**
**మనశ్చేన్న లగ్నం గురోరంఘి పద్మే తతః తతః కిం తతః కిం తతః కిం॥**

ఈ లోకంలో ధనధాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు, ఉన్నత పదవులు, అందమైన గుణవతి అయిన భార్య, కీర్తిప్రతిష్టలు ఎన్ని ఉన్నా, మంచి కుమారులు

ఎంతమంది ఉన్నా, గురువు యొక్క కృపాకటాక్ష వీక్షణాలు గనక మన మీద ప్రసరించకపోతే, ఏ మాత్రము ఉపయోగం లేదు. సాక్షాత్తు దత్తావతారము, అమ్మవారికి ప్రతిరూపము అయిన గణపతి స్వామివారే పిలిచి సన్మానిస్తానంటే అంతకన్న కావలసింది ఏముంది? సరే అన్నాను. విజయవాడ నుంచి బెంగుళూరుకు విమానంలో, అక్కడ నుంచి మైసూరుకు ప్రత్యేక కారులో తీసుకువెళ్ళి, అక్కడ పెద్ద సూట్ ఏర్పాటుచేసి మళ్ళీ అలాగే ఇంటికి పంపారు. అక్కడ పైకి పిలిచినప్పుడు మంటపంలో కూర్చున్న వారంతా లేచి నుంచుని చప్పట్లు కొడుతూ, పైకి ఆహ్వానించి **గణపతి సచ్చిదానంద ప్రశస్తి** అవార్డు ఇచ్చి సత్కరించారు. ఇంతవరకు ఆ అవార్డు వారిలో తీసుకున్న మూడవ వాణ్ణి నేనే. విచిత్రం ఏమంటే ఆశ్రమంలో ఆ రాత్రి నిద్రపోయాను. తెల్లవారి లేచేసరికి నా గది దగ్గర ఒకాయన నుంచుని ఉన్నారు. నన్ను చూడగానే 'స్వామీ ! మీకు పాలు కావాలా? కాఫీనా టిఫిన్ ఎన్ని గంటలకు? అని అడిగి అన్నీ ఆయనే సమకూర్చారు. ఆయన హైదరాబాద్‌లో వ్యాపారస్తుడట. సంవత్సరానికి వందకోట్ల టర్నోవరు చూడండి ఆ వైభవం. సాక్షాత్తు భగవంతుడే తలచుకుంటే జరగనిది ఏముంటుంది? ఆయన నాకు అటెండెంటు. తెల్లవారేసరికి చేతులు కట్టుకుని తలుపు దగ్గర నుంచున్నారు. అలాగే 2009లో అమెరికా వెళ్ళినప్పుడు అక్కడ మాతా కరుణామయి చేతులు మీదుగా ఐసిసిటికి ఆస్థాన విద్వాంసుడుగా నియమించారు. నెల్లూరుకు 80 కిలోమీటర్ల దూరంలో ఉంది పెనుశిలకోన. ఇది లక్ష్మీనృసింహ క్షేత్రము. స్వామి వారి ఆలయానికి సుమారు వందమీటర్ల ముందు ఉంటుంది. మాతా విజయేశ్వరీ దేవి ఆశ్రమం. దాని పేరు **మణిద్వీప మహాసంస్థానం.** శ్రీవిద్య పుస్తకం వ్రాసినప్పుడు 25-12-2009న ఆ పుస్తకాన్ని మాతాజీకీ అంకితం ఇచ్చాను. అదే మాతాజీతో తొలిపరిచయం. ఆ తరువాత నా పుస్తకాలు మరికొన్ని వారికి అంకితం ఇచ్చాను. బ్రహ్మసూత్రభాష్యం పుస్తకం వారి ఆశ్రమం తరఫునే ప్రచురితమైంది. మాతాజీకి నేనంటే చాలా అభిమానం. వారి జీవితచరిత్ర సిడిగా చెప్పాను. ఈ రకంగా మొత్తం 2150 గంటలపాటు ఉపన్యాసాలు సి.డి.ల రూపంలో ఉన్నాయి. ఇవన్నీ విశ్వా ఇన్ఫోటెక్ విజయవాడ. సెల్ : 9030306677లో దొరుకుతాయి.

# 8. ప్రపంచ రికార్డులు

2014 సం॥ జనవరి 26వ తారీకున శ్రీవిద్య మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలు అనే విషయం మీద హైదరాబాదులో నిరవధికంగా 12 గం॥పాటు ఉపన్యాసం చెప్పాను. దీన్ని మాతాజీనే పర్యవేక్షించారు. భార్య పోయిన 15వ రోజున జరిగిన ఉపన్యాసమది. అంతకు ముందు నెలరోజుల నుంచి మా రమాదేవి హిస్పిటల్‌లో ఉంది. అలాగే వెళ్ళి ఉపన్యాసం చెప్పి వచ్చాను. నేను ఉపన్యాసం చెప్పినంత వరకు మాతాజీ స్టేజిపైనే ఉన్నారు. ఆసాంతం విన్నారు. **ఈ ఉపన్యాసం జీవియస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డు** కోసం చెయ్యబడింది. నా జీవితంలో అది ఒక మరువలేని సంఘటన. ఇప్పటివరకు చెప్పిన ఉపన్యాసాలలో 1.వేదవిజ్ఞానము 122 గం॥ 2.రామాయణ కథాసుధ 121 గం॥లు 3. యోగవాసిష్టము 142 గం॥లు వంటివి ప్రపంచ రికార్డులుగా గుర్తించబడ్డాయి. ఇప్పటివరకు 21 ప్రపంచ రికార్డులు నమోదయినాయి. ఇప్పటివరకు చెప్పిన ఉపన్యాసాలు చిన్నవి. 2013 సం॥లో ఒక చిన్న ఆలోచన వచ్చింది. ఉదయం నుంచి సాయంత్రందాకా 12 గం॥పాటు నిరవధికంగా ఉపన్యాసం చెబితే ఎలా ఉంటుంది? ఆ రోజుల్లో అన్నమాచార్య కీర్తనలు పాడేవారు ఇలాంటి కార్యక్రమాలు చేసేవారు. అదే నేను చేస్తే? నేను ఒక్కడినే మాట్లాడుతుండాలి. ఇది ఆధ్యాత్మిక ఉపన్యాసం. ఇంతవరకు ఎవరూ ఇటువంటి కార్యక్రమం చేపట్టలేదు. ఈ కార్యక్రమం విజయవంతం కావాలంటే 1.జ్ఞాపకశక్తి బాగా కావాలి. మామూలుగా ఉపన్యాసం చెబితే, ఏ రోజు చెప్పవలసిన విషయం ఆ రోజు చూసుకుని వెళ్ళచ్చు. కాని ఇక్కడ పుస్తకం చూడటానికి కూడా సమయం ఉండదు.

2. అంతసేపు చెప్పాలంటే కూర్చోగలగాలి. ఓపిక కావాలి.

3. గొంతు పని చెయ్యాలి

4. ఇలాంటివన్నీ డబ్బులతో గురించిన పనులు. వచ్చిన వారందరికీ ఉదయం పది గం॥కు టీ, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం 4 గం॥కు టీ, బిస్కట్లు ఇవ్వాలి. హాలుకు అద్దె, కరంటు ఛార్జీలు, ప్రెస్ వాళ్ళు, బ్యానర్లు మెమెంటోలు కావాలి.

5. అన్నింటికీ మించి కార్యక్రమ నిర్వాహకులు కావాలి. ఇలా అనేక ఖర్చులు. వీటన్నింటికీ డబ్బులు. మంది మార్బలం అంతా కావాలి. కాబట్టి ఈ రకమైన ఉపన్యాసం చెప్పటం నా వల్ల అవుతుందా? అసలు ముందు అంతసేపు చెప్పగలవో లేదో చూడు' మా రమాదేవి సలహా. మొండివాడు రాజుకన్న బలవంతుడు. ధైర్యమే సాహసం. అంతే 26-10-2013న ఉదయం 7.00 గం॥ నుంచి సాయంత్రం 7.00 గం॥ వరకు **లలితా సహస్రనామ భాష్యము** నిరవధికంగా 12 గం॥ పాటు అంతర్జాతీయ ప్రమాణాలతో **వండర్ బుక్ ఆఫ్ రికార్డ్సు** కోసం ఉపన్యాస కార్యక్రమం ఏర్పాటు చేశాను. ఏమైతే ఏం, కార్యక్రమం ప్రారంభమైంది. విజయవంతంగా పూర్తయింది. కుర్తాళం పీఠాధిపతి సిద్ధేశ్వరానంద భారతి వారు ముగింపు సభకు విచ్చేశారు. రమాదేవి గారు పాల్గొన్న ఆఖరుసభ ఇదే. తలచుకుంటేనే కళ్ళ వెంబడి నీళ్లు తిరుగుతున్నాయి. పడుతూ లేస్తూ అలాగే ముగింపు సభకు వచ్చింది. ఉపన్యాసం పూర్తయ్యే సరికి గొంతు కూడా పూర్తిగా పోయింది. రికార్డు సాధించామనే ఆనందంతో రమాదేవి ముఖం వింత కాంతులతో వెలిగిపోయింది.

2. తరువాత 26-01-2014న అంటే రమాదేవి కాలం చేసిన 15వ రోజున **శ్రీవిద్యా మంత్ర, యంత్ర, తంత్ర రహస్యాలు** అనే అంశం మీద సికిందరాబాద్ నాచారంలో ఉన్న నోమా ఫంక్షన్ హాలులో, మాతా విజయేశ్వరీ దేవి వారి ఆధ్వర్యంలో **జీనియస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్** కోసం 12 గం॥ పాటు ఉపన్యాసం చెప్పాను.

ఇది చాలా గొప్ప అనుభవం. రమాదేవి మరణించక ముందు 30-12-2013 నుంచి ఆవిడ హాస్పిటల్‌లోనే ఉంది. ఎట్టకేలకు 12-01-2016 రాత్రి ముక్కోటి ఏకాదశి వెళ్ళిన తరువాత ద్వాదశి గడియల్లో కన్ను మూసింది. పదమూడు రోజులు కార్యక్రమాలన్నీ అయిపోయినాయి. అందరూ వెళ్ళిపోయారు. 25-1-2014 ఉదయం నేను కూడా హైదరాబాద్ వెళ్ళాను. ఆ సాయంత్రం మాతాజీ వచ్చారు. స్టేజిమీద వారిని చూడగానే నాకు దుఃఖం ఆగలేదు. వారే నా కళ్ళు తుడిచి 'పోనీ ప్రోగ్రామ్ కాన్సిల్ చేద్దామా' అన్నారు. వద్దు అన్నాను. 'చెప్పగలవా' అన్నారు. నోట మాట రాలేదు. చెబుతాను అని తల ఊపాను. మాతాజీ ఏమీ అనలేదు. విషయం అక్కడ ఇంకెవరికీ తెలియదు.

మరునాడు ఉదయం జ్యోతి ప్రజ్వలన జరిగిన తరువాత ఉపన్యాసం ప్రారంభమైంది. కార్యక్రమం పూర్తయ్యేదాకా మాతాజీ కూడా స్టేజిమీదనే ఉన్నారు. ఉపన్యాసం దిగ్విజయంగా పూర్తయింది. **రెండవ ప్రపంచ రికార్డు వచ్చింది.**

3. 6-2-2016న **చతుర్వేద భాష్యం** అనే అంశం మీద విజయవాడలోని రామకోటిలో ఉపన్యాస కార్యక్రమం చేశాను. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భాషా సాంస్కృతిక శాఖ, రసభారతి (సాహితీ సంస్థ) వారి ఆధ్వర్యంలో జీనియస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ కోసం ఈ కార్యక్రమం జరిగింది. ఇది మూడవ ప్రపంచ రికార్డు.

ఈ కార్యక్రమంలో రికార్డు ప్రదానానికి పెదపులిపాక శ్రీవిద్యా పీఠాధిపతులు **శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి** వారు, చిట్టిగూడూరు సాయిపీఠం అధిపతి **సాయిమాతా** విచ్చేశారు.

4. 23-7-2017న తిరుపతిలోని అన్నమాచార్య కళామందిరంలో మహావిద్యా పీఠం, తిరుపతి మరియు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర భాషా సాంస్కృతిక శాఖల ఆధ్వర్యంలో ఉదయం 7.00 గం॥ నుండి సాయంత్రం 7.00 గం॥ వరకు **విష్ణు సహస్రనామ భాష్యము** అనే అంశం మీద **గోల్డెన్ స్టార్ వరల్డ్ రికార్డ్స్** కోసం నిరవధికంగా 12 గం॥ ఉపన్యాసం జరిగింది. ఇది నాల్గవ ప్రపంచ రికార్డు. రికార్డు ప్రదానోత్సవానికి యం.ఎల్.సి. గాలిముద్దు కృష్ణమనాయుడు విచ్చేశారు.

5. 15-4-2019న బ్రహ్మసూత్ర భాష్యం అంతర్జాతీయ ప్రమాణాలతో నిర్విరామంగా 12 గం॥ పాటు **ఛాంపియన్స్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డు** కోసం 70వ సంవత్సరంలో విజయవాడ బి.ఆర్.టి.ఎస్. రోడ్డులోని గాయత్రీ కన్వెన్షన్ హాలు నందు ఏర్పాటు చెయ్యటం జరిగింది.

గతంలో జరిగిన కార్యక్రమాల కన్న ఇది చాలా గొప్పగా జరిగింది. నేను ఊహించిన దానికన్న చాలా గొప్పగా జరిగింది. ఈ కార్యక్రమానికి గుంటూరులోని శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ గంభీరానంద భారతి విచ్చేశారు. ఈ సందర్భంగా **అష్టావక్రగీత** గ్రంథం ఆవిష్కరణ జరిగింది.

ఈ ఉపన్యాసాల వల్ల పేరయితే వచ్చింది కాని ఒక్కొక్క ఉపన్యాసానికి సుమారుగా రూ. 35,000/- జేబులో డబ్బులు ఖర్చయినాయి. బ్రహ్మసూత్ర భాష్యానికి పూర్తిగా ఖర్చు నాదే.

# 9. హోమాలు-యాగాలు

సత్యన్నారాయణపురం, విజయవాడ-11 లోని తాడంకి వారి వీధిలో రాఘవ నారాయణ శాస్త్రి మున్సిపల్ స్కూలు ఎదురుగా ఉన్న వేమవరపు శేషగిరిరావు గారి ఇంట్లో మేడమీద ఉండేవాణ్ణి. త్రిపురా రహస్యాన్ని వచన రూపంలో వ్రాసిన జానుమద్ది హనుమచ్ఛాస్త్రి గారు వీరి అల్లుడు. నేను వారింట్లో ఉండగా వెనకనే ఉన్న గడియారం వారి వీధిలో **విష్ణుభట్ల లక్ష్మీనృసింహ ఘనపాఠీ** గారు ఉండేవారు. వారు కనకదుర్గ దేవస్థానంలో 'మహావిద్య' పారాయణ చేసేవారు. దేవస్థానం ఉద్యోగి. ప్రతిరోజు రాత్రి ఎనిమిది గంటలు అయ్యేసరికి వారి జపం పూర్తి అవుతుంది. 8.30 గం॥ భోజనం చేస్తారు. మధ్యలో అరగంట ఖాళీ. ఆ సమయంలో నేను వెళ్ళి వారి దగ్గర కూర్చునేవాణ్ణి. అలా మా ఇద్దరికీ గట్టి పరిచయం ఏర్పడింది. వారి దగ్గర మంత్రశాస్త్రము, యాగాలు, హోమాల గురించే ఎక్కువగా మాట్లాడటం జరిగేది. దాంతో జపం కన్న హోమం చేస్తే ఫలితం ఎక్కువగా ఉంటుంది అనే విషయం నా బుర్రలో బలంగా నాటుకుపోయింది. కొంతకాలం తరువాత హోమప్రక్రియ అంతా నేర్చుకున్నాను. ఇంట్లోనే మేడ మీద చిన్న హోమకుండం కట్టించుకున్నాను. ప్రతి ఆదివారము గణపతి హోమం చేస్తుండే వాణ్ణి. ఒకసారి హోమానికి కూర్చున్నాను. మంత్రం సాగుతోంది. హోమం జరుగుతోంది. ఇంతలో పూర్ణాహుతి కోసం తెచ్చుకున్న కొబ్బరికాయ గుర్తు వచ్చింది చుట్టూ చూశాను. కనిపించలా. కాయ ఎప్పుడైతే కనిపించలేదో, అప్పుడు కంగారు మొదలైంది. హోమం దారిన హోమం జరుగుతూనే ఉంది. ఆహుతులు పడుతున్నాయి. కాని నా కళ్ళు కొబ్బరికాయని వెతుకుతున్నాయి. నా మనసంతా కొబ్బరికాయ మీదే ఉంది. డాబా మీద ఎవరూ లేరు నేను ఒక్కడినే. పైకి వచ్చేటప్పుడు కొబ్బరికాయ తెచ్చాను. మరి ఏమైంది? ఎక్కడికి పోయింది? అర్థం కాలా, హోమం చేసేటప్పుడు, హోమం చేయించే ఋత్విక్కు దక్షిణం వైపుగా కూర్చుంటాడు. మనమే హోమం చేసుకుంటే, దక్షిణ దిక్కున రెండు దర్భపుల్లలు, అక్షతలు ఒక రూపాయి నాణెము వేసి, అక్కడ ఋత్విక్కు కూర్చున్నట్లుగా భావన చేస్తాం. ఇప్పుడు నేను కూడా అదే పని చేశాను. **"బ్రాహ్మణం దక్షిణతో దర్భేషు నిషాద్య. త్వం బ్రహ్మాభవ ఇదమాసనం సుఖాసనం"** అని చెప్పి రెండు

దర్భపుల్లలు, అక్షతలు వేశాను. ఇప్పుడు కొబ్బరికాయ కోసం వెతుకుతున్నాను. దక్షిణ భాగంలో, ఋత్విక్కు కూర్చునే చోట ఘనపాఠీ గారు కూచుని ఉన్నారు.

"ఏమిటి వెతుకుతున్నావ్?" అన్నారు

"కొబ్బరికాయ కనపడలేదు" అన్నాను

"దాంతో ఇప్పుడు నీకేం పని. కాయ కావలసింది పూర్ణాహుతికి కదా? మంత్రం మీద దృష్టి పెట్టు అదిగో కొబ్బరికాయ అక్కడుంది చూడు" అని చెయ్యి పెట్టి చూపించారు. అత్యాశ్చర్యకరము. ఆయన చూపించిన చోట కొబ్బరికాయ ఉంది. ఇందాకటి దాకా నేను ఆ ప్రదేశం అంతా వెతికాను. కాయ కనపడలా ఇప్పుడు అక్కడే ఉంది. ఇదే గురు మాహాత్మ్యము అనుకున్నాను ఆ తరువాత ఈ విషయం అందరికీ చెప్పాను. వారు కూడా ఆశ్చర్యపోయారు. ఇదంతా గురువు అనుగ్రహం అన్నారు. **హోమం చేస్తున్నప్పుడు ఇది నా మొదటి అనుభవం.** ఆ తరువాత నుంచి హోమం చేస్తున్నప్పుడు ఎవరో ఒక పెద్దాయన కనిపించటం జరుగుతూనే ఉండేది. ఇదంతా నేను రిటైరు కాక ముందు విషయం.

ఆ రోజుల్లో దసరా పండగలప్పుడు నవరాత్రులు చేసేవాణ్ణి. ప్రతిరోజు చండీ సప్తశతి పారాయణ చేసి ఆఖరు రోజున వసిష్ఠుల వారిని పిలిచి చండీ హోమం చేసేవాణ్ణి. కొంతకాలం తరువాత వాళ్ళు సరిగా చెయ్యటం లేదు అనిపించింది. దాంతో చండీ హోమం కూడా నేనే చెయ్యటం మొదలు పెట్టాను. అంతకు ముందు నుంచే ప్రతిరోజు మహావిద్య హోమం చేస్తున్నాను. ఇప్పటికి 15 సంవత్సరాలుగా ప్రతిరోజు మా యింట్లో మహావిద్య హోమం జరుగుతూనే ఉంది. ఇప్పుడు చండీ, మహావిద్య రెండు హోమాలు చెయ్యటం మొదలుపెట్టాను. 2008 డిసెంబరులో అష్టోత్తర శతచండీ యాగం చేశాను. 2009 జనవరి ఒకటిన పూర్ణాహుతి జరిగింది. ఆ తరువాత సహస్ర చండీయాగం చేస్తే బాగుండు అనిపించింది. నేను ఒక్కడినే. నాకు సహాయకులు ఎవరూ లేరు. రోజుకు నాలుగు హోమాలు. ఇలా 250 రోజులు జరగాలి. యాగ ప్రారంభానికి ముహూర్తం మా కృష్ణారావు గారే పెట్టారు. మార్చి ఒకటిన ముహూర్తం. యాగం ప్రారంభమైంది. 500 సార్లు జరిగింది. ఇక ఇక్కడనుంచే అనేకానేకమైన అనుభవాలు. ప్రతిరోజు కలలో హోమం చేస్తుండే వాడిని. క్రొత్త క్రొత్త విషయాలు చూస్తుండే వాడిని.

ఒకరోజు హోమం జరుగుతోంది. ఇప్పుడు నాకున్నది పెద్దహోమకుండం. లోపలివైపు 36 అంగుళాలుంటుంది. హోమకుండం దగ్గర ఎవరో కూర్చున్నారు. ముందు లీలామాత్రంగా కనిపించారు. తరువాత స్ఫుటంగా దర్శనమిచ్చారు. ఎవరో తెలియదు నేనెప్పుడూ వారిని చూడలేదు. హోమకుండం దగ్గర కూర్చుని చూస్తున్నారు. కాసేపు కూచుని వెళ్ళిపోయారు.

తరువాత ఒకరోజున చాలామంది వచ్చారు. హోమకుండం చుట్టూ కూర్చున్నారు. అంతా నిశ్శబ్దం. అందులో ఇద్దరు స్త్రీలు కూడా ఉన్నారు.

ఇంకొక రోజు హోమకుండం దగ్గర క్రింది నుంచి పైకి మెట్లు కనిపిస్తున్నాయి. నిజంగా లేవు. ఒకాయన కాషాయం రంగులో ఉన్న బురఖా వంటి చొక్కా వేసుకున్నాడు. జుట్టు బాగా మెరిసిపోయింది. ఆ మెట్ల మీద నుంచుని చూస్తున్నాడు. రెండు రోజుల తరువాత మళ్ళీ వచ్చాడాయన. ఈసారి చాలామంది సన్యాసులతో కలిసి వచ్చాడు. వారంతా ఒక బస్సులో వచ్చారు. ఆ బస్సును ఉత్తరం వైపు ఆపారు. అందులోంచి ఒక్కొక్కరే దిగుతున్నారు. ఈ పెద్దాయన బస్సు దగ్గరే నుంచుని అందరినీ నిశ్శబ్దంగా వెళ్ళమని చెబుతున్నాడు. అందరూ క్రింద నుంచి పైకి వచ్చి హోమం చూసి వెడుతున్నారు. ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు.

హోమానికి కూర్చునే సమయానికి నాకు ఏవో నిదర్శనాలు కనిపించేవి. అలా కనిపించిన రోజున ఏదో జరుగుతుంది. ఎవరో వస్తారు అని నమ్మకం. అలాగే జరిగేది కూడా.

ప్రతిరోజు నాలుగు ఆ వృత్తులు హోమం జరిగేది. నాల్గవ ఆ వృత్తికి సరోవర్ మెస్ రెడ్డిగారు, దర్భా వెంకటేశ్వర్లు గారు వచ్చి కూచునే వారు.

ఒకరోజు హోమం నాల్గవ ఆ వృత్తి జరుగుతోంది. నేను హోమం చేసే చోట, పైన రేకులు ఉంటాయి. ఆ రేకుల క్రింద ఉన్న ఇనపకడ్డీకి తాడుతో ఉయ్యాల వ్రేలాడుతోంది. ఆ ఉయ్యాలలో 16, 17 సం॥ పిల్ల. లంగా, ఓణీ వేసుకుంది. నీలాంబరం రంగు బట్టలు. ఉయ్యాల ఊగుతోంది. ఆ పూవు హోమకుండం మీదగా వెడుతోంది. ఉయ్యాల ఊగినప్పుడు తను కట్టుకున్న బట్టలు హోమకుండం మీదగా జీరాడుతున్నాయి. హోమకుండంలో అగ్ని ప్రజ్వరిల్లుతోంది. తను కట్టుకున్న బట్టలు అంటుకుంటాయేమోని నా భయం. దాంతో ఒక్కసారిగా 'ఏయ్' అని అరిచాను.

నా దగ్గర కూర్చున్న వాళ్ళు అదిరిపడి ఏం జరిగింది? అన్నారు. విషయం వివరించాను. 'అమ్మవారు అనుగ్రహించింది' అన్నారు.

ఒకసారి హోమం జరుగుతోంది. ప్రక్కనే ఉన్న తలుపు దగ్గర నుంచుని చూస్తోంది. తలుపు దగ్గర ఎందుకు? ఇవతలకు రా! అన్నాను. రాలేదు. వెళ్ళిపోయింది.  ఒకసారి ఒక పెద్దాయన వచ్చాడు. తెల్లని బట్టలు ధరించాడు. పద్మాసనం వేసుకుని కూర్చుని ఉన్నాడు హోమకుండం దగ్గర ఎవరు వీరంతా ? గురుమండలము అని చెప్పారు పెద్దవాళ్ళు. ఇలా ఒకరు ఇద్దరు కాదు అనేకమంది అనేకసార్లు వచ్చేవాళ్ళు. హోమం దగ్గరకి.

ఒకసారి ఆహుతులు సమర్పిస్తున్నాను. హోమకుండంలోంచి ఒక చెయ్యి వచ్చింది. ఆ చేతిలో నేను ఆహుతులు సమర్పించాను.

యాగం చివరాంకంలోకి వచ్చేటప్పటికి కలలో కనిపించిన విషయాలన్నీ తెల్లవారే సరికి జరిగేవి. ఒకరోజు రాత్రి తెల్లవారుజామున కల. ఎవరో చచ్చిపోయారు. నాకు తెలిసిన వాళ్ళే. వాళ్ళని తీసుకు వెడుతున్నారు. పూలు జల్లుతున్నారు. ఎవరో తెలియటం లేదు. తెల్లవారింది. హోమం నాలుగు అధ్యాయాలు జరిగింది. ఫోను మ్రోగింది. హలో... అన్నాను మా చెల్లెలు. 'ఏమ్మా! మీ మామగారు బాగున్నారా?' అన్నాను. "లేదు తెల్లవారుఝామున పోయారు' అంది.

కలలో కనిపించిన దృశ్యం అదే.

ఇంకొక రోజు ఇలాగే కల వచ్చింది. తెల్లవారే సరికి మా యింటి ప్రక్కనాయన పోయాడు.

రెండు రోజుల తరువాత ముందు సందులో ఆయన మరణించాడు. ఇలా యాగం పూర్తయ్యేసరికి పదిమందిదాకా మరణించారు. నాకు చాలా భయం వేసింది.

2017లో మళ్ళీ రెండవసారి సహస్ర చండీయాగం చేశాను. అప్పుడు కూడా ఇలాగే అనేకానేక అనుభవాలు. ఒకసారైతే మూడు సంవత్సరాల పిల్ల. ఎర్రటి లంగా జాకెట్టు వేసుకుంది. చేతులకు బంగారు మురుగులు, కాళ్ళకి పట్టాలు. రెండు చిన్న చిన్న జడలు వేసుకుంది. వచ్చి నాప్రక్కన గోడకి ఆనుకుని కూచుంది. ఏమీ మాట్లాడలేదు. అలా చాలాసేపు కూచుంది.

వనదుర్గాపంచశతి (మహావిద్య) సహస్రయాగం చేసేటప్పుడు గణపతి హోమం జరిగేటప్పుడు, ఎన్నెన్నో అనుభవాలు అతిరుద్ర మహాయాగం జరుగుతున్నప్పుడు ప్రతిరోజు ఇటువంటి అనుభవాలు కోకొల్లలు. యాగపూర్ణాహుతి డిసెంబరులో జరుగుతుంది. డిసెంబరు 13 నా పుట్టినరోజు, పెళ్ళిరోజు కూడా. అందుకని పూర్ణాహుతి డిసెంబరులోనే సెలవు రోజున జరుగుతుంది. ఆ రోజున లలితా సహస్ర పారాయణ, చండీయాగ పూర్ణాహుతి జరుగుతాయి. పూర్ణాహుతికి ముందు పండిత సత్కారము, వచ్చిన స్త్రీలందరికీ బట్టలు పెట్టి సువాసిని అర్చన చెయ్యటం జరుగుతుంది. 2017లో అయితే శ్రీవిద్యా పురస్కారాలు 1. బ్రహ్మశ్రీ యాబులూరి లోకనాథ శర్మగారికి 2. బ్రహ్మశ్రీ దర్భా ఉమాశంకర్ గారికి ఇవ్వటం, పండితుడుగా గరిమెళ్ళ సోమయాజులు గారిని సత్కరించటం జరిగింది. గొల్లపూడి కామాక్షీ పీఠం, సుందర కాత్యాయని (జ్ఞానాంబ) గారిని సువాసినిగా అర్చించటం జరిగింది. ఈ రకంగా ప్రతిసారి జరుగుతూనే ఉంటుంది. హోమం చేస్తున్నప్పుడు హోమకుండంలో అమ్మవారి రూపం కనిపించేది. 2017 డిసెంబరు 25న సహస్రచండీ యాగానికి పూర్ణాహుతి జరుగుతున్నప్పుడు హోమకుండంలో శ్రీ కృష్ణపరమాత్మ కనిపించాడు. ఆ జ్వాల అందరూ చూశారు. అది ఒక పుస్తకానికి కవర్ పేజీగా కూడా వేశాను. ఈ సందర్భంగా 4-11-2017న కార్తీక పౌర్ణమి నాడు ఉదయం 6.00 గం॥ నుండి రాత్రి 9.00 గం॥ల వరకు 15 గం॥లలో 15 చండీ హోమాలు చేశాను. ఇది **సుప్రీం వరల్డ్ రికార్డు**గా నమోదయింది.

2018 ఏప్రియల్‌లో ఒరిస్సాలో బెరంపురం దగ్గర ఉన్న తారాతారిణీ క్షేత్రంలో హోమం చేస్తే, **హోమకుండంలో తారాదేవి దర్శనమిచ్చింది.**

18-06-2018న మా ఇంట్లోనే వజ్రవైరోచని హోమం చేస్తే హోమకుండంలో **ఛిన్నమస్త కనిపించింది.**

2018 ఆగష్టులో ఒకసారి కృష్ణారావు గారికి ఫోన్‌చేసి వజ్రవైరోచని (ఛిన్నమస్త) యాగం చెయ్యాలనుకుంటున్నాను. నాకు ఏదైనా మంచి ముహూర్తం చెప్పండి అన్నాను. 15-8-2018 బుధవారం ఉదయం 10.30 గం॥కు తులాలగ్నం. లగ్నంలో గురువు, తృతీయంలో శని ఉన్నారు. ముహూర్తం బాగుంది. కాకపోతే

వ్యయంలో లగ్నాధిపతి శుక్రుడు చంద్రుడితో కలిసి ఉన్నాడు. ఖర్చు బాగా అవుతుంది. అన్నారు. ఫరవాలేదు అని ఆ సమయానికి **ఛిన్నమస్తా పాశుపతం, అతిరుద్రం** చెయ్యటం మొదలు పెట్టాను. ప్రతిరోజు ఒక రుద్రం అంటే పదకొండు ఆ వృత్తులు హోమం చెయ్యాలి. కష్టమైన పని. అయినా ప్రారంభం చేశాను. దగ్గర దగ్గరగా పూర్తి కావస్తున్న సమయంలో ఛిన్నమస్తా మంత్రం సంపుటీకరణ చేసి సప్తశతి 108 హోమాలు చేస్తే బాగుంటుంది అన్నారు దర్భా ఉమాశంకరుగారు. అలాగే అని అది కూడా ప్రారంభించాను. పగలు పాశుపతం, రాత్రికి సంపుటిత చండి. చాలా కష్టమైంది. ఛిన్నమస్తా పాశుపతం అంటే ఒక ఆవృత్తికి అరగంట పడుతుంది. పదకొండు సార్లు కావాలంటే కనీసం ఆరుగంటల సమయం కావాలి. అలాగే ఛిన్నమస్తా సంపుటిత చండీ సప్తశతి హోమం చెయ్యాలంటే కనీసం నాలుగు గంటలు సమయం కావాలి. చివరలో సంపుటితచండి రోజుకు మూడుసార్లు చేశాను. నిజంగా వళ్ళు హూనం అయిపోయింది. ఈ సంవత్సరం (2018) డిసెంబరులో డబ్భైయవ సంవత్సరంలో అడుగు పెట్టాను. వీటన్నింటినీ పురస్కరించుకుని 03-02-2019 ఆదివారం పూర్ణాహుతి చేశాను.

ప్రతిసారీ పూర్ణాహుతి రోజున శ్రీవిద్యాపరులకు సన్మానం, కాత్యాయనమ్మ గారికి సువాసినీ అర్చన జరుగుతాయి. ఈసారి కూడా అలాగే జరిగింది. కాకపోతే పూర్ణదీక్షాపరులని, షోడశి ఉన్న వారిని, విడిగా సత్కరించాను. పండిత సత్కారం జరిగింది. ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న **'మహావాక్యదర్పణం'** ఆ రోజే ఆవిష్కృతమైంది. రమాదేవి పేరుతో వ్రాసిన **'మన సంస్కృతి మూఢాచారమా'** పుస్తకాలు అందరికీ పంచాను.

ఇలా ప్రతిసారి అమ్మవారు హోమకుండంలో దర్శనమిస్తూనే ఉంటుంది.

ఇదంతా అమ్మవారి అనుగ్రహమే తప్ప వేరేదీ కాదు. నేను కేవలము నిమిత్తమాత్రుణ్ణి.

# 10. శ్రీవిద్యాపరులు

శ్రీవిద్య బ్రహ్మవిద్య, జ్ఞానవిద్య, మోక్షవిద్య. స్త్రీ దేవతలను అర్చించినంత మాత్రం చేత అది శ్రీవిద్య కాదు. ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే దశమహావిద్యలు కూడా శ్రీవిద్య కాదు. దశమహావిద్యలు అంటే

1.కాళీ 2.తార 3.త్రిపురసుందరి 4.ధూమావతి 5.భువనేశ్వరి 6.భైరవి 7.ఛిన్నమస్త 8.మాతంగి 9.బగళాముఖి 10.కమలాత్మిక

వీటిని రెండు జట్లుగా విడదీసి చెప్పవచ్చు. మొదటి జట్టునే కులము అంటారు. కులము అంటే భాగము, జట్టు అని అర్థం.

**1.కాళీకులము :** ఇందులో ఐదువిద్యలు (దేవతలు) ఉంటాయి. 1.కాళి 2.తార 3.ఛిన్నమస్త 4.ధూమావతి 5.భైరవి

**2.శ్రీకులము :** ఇందులో ఐదు విద్యలు (దేవతలు) ఉంటాయి. 1.షోడశి 2.మాతంగి 3.కమలాత్మిక 4.భువనేశ్వరి 5.బగళాముఖి

రెండవ జుట్టుతో పోలిస్తే మొదటి జుట్టులోనివి మరీ ఉగ్రదేవతలు. తమోగుణ ప్రధానమైనవి. మొత్తం మీద దశమహావిద్యలు రజోగుణ, తమోగుణ ప్రధానమైనవి. దక్షిణ భారతదేశంలో వీటి ఉపాసన చాలా తక్కువ. శ్రీవిద్య పూర్తిగా సాత్త్వికమైనది. దక్షిణ భారతంలో శ్రీవిద్య చాలా ప్రాచుర్యం పొందింది. ఆంధ్ర రాష్ట్రంలో శ్రీవిద్యను బాగా ప్రచారం చేసినవారు గుంటూరులోని శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ కళ్యాణానంద భారతీ మహాస్వామి. శ్రీవిద్యను ఏడు భాగాలుగా చెప్పవచ్చు.

1.మంత్రజపం 2.నిత్యపూజ 3.చక్రార్చన 4.హోమము 5.మంత్ర సాహిత్యము 6.గ్రంథరచన 7.ఉపన్యాసాలు

శ్రీవిద్యాపరులలో ఎక్కువమంది మంత్రజపం, నిత్యపూజ మాత్రం చేస్తారు. 90% దాకా ఇలాంటివారే ఉంటారు. ఈశ్వరుడు అభిషేక ప్రియుడు. విష్ణువు అలంకార ప్రియుడు గణపతికి తర్పణ ఇష్టం. అమ్మవారికి అర్చన అంటే ఇష్టం. అందుకే శ్రీవిద్యలో చక్రార్చనకు చాలా ప్రాధాన్యత ఉన్నది. దీనికి చాలా సమయం

పడుతుంది. **కళ్యానానంద భారతి** సంప్రదాయంలో ఎక్కువగా చక్రార్చన జరుగుతుంది. హోమము అనేది సమయమే కాకుండా ఖర్చుతో కూడిన పని. అందుచేత మహా అయితే పరవడి రోజుల్లో తప్ప హోమం చెయ్యరు. ప్రతినిత్యం హోమాలు చేసేవారు చాలా తక్కువ. మంత్రజపం చేస్తారు కాని మంత్ర సాహిత్యాన్ని గురించి చాలా తక్కువ మందికి మాత్రమే తెలుసు. శ్రీవిద్యమీద గ్రంథాలు వ్రాసేవారు లక్షకి ఒకరు కూడా ఉండరు. వీరందరిలోను ఉపన్యాసాలు చెప్పగలవారు ఇంకా తక్కువగా ఉంటారు. ఈ లక్షణాలన్నీ ఉన్న వారు దరిదాపుగా కోటికి ఒకరుంటారేమో.

ఒకసారి నా భార్య అడిగింది. "దేశంలో చాలామంది ఉపాసనాపరులున్నారు. నీకన్నా పెద్దవాళ్ళు ఉన్నారు. కాని చాలామంది నీకు ఎందుకు ఫోన్ చేస్తున్నారు? తమకేదో అనుమానం ఉన్నది అని నీ దగ్గరకు ఎందుకు వస్తున్నారు?" ఇది ఆవిడ అనుమానం. దీనికి కారణం పైన చెప్పిన లక్షణాలలో చాలావరకు నా దగ్గర ఉన్నాయి. మంత్ర జపము, నిత్యపూజ అందరూ చేస్తారు. చక్రార్చన అందరూ చేసుకునేందుకు వీలుగా పుస్తకం వ్రాశాను. నిత్యం మా యింట్లో హోమం జరుగుతుంది. సహస్ర చండీయాగము రెండుసార్లు చేశాను. మహావిద్య హోమం వెయ్యిసార్లు చేశాను. అతిరుద్రం రెండుసార్లు చేశాను. మా ఇంట్లో ప్రతిరోజు హోమం జరుగుతూనే ఉంటుంది. అదంతా నా కోసమే తప్ప ఎవరికోసమూ నేను చెయ్యను. నా దగ్గరకు వస్తే వారితో చేయిస్తాను. అంతేకాని ఎవరి కోసము నేను మాత్రం చెయ్యను. మంత్రసాహిత్యం నాకు కొంతవరకు తెలుసు. శ్రీవిద్య మీద నేను వ్రాసిన గ్రంథాలు ఉన్నాయి. అవిగాక ప్రత్యేకంగా 'శ్రీవిద్య' పేరుతో గ్రంథం వ్రాశాను. నేను చెప్పిన ఉపన్యాసాలు 2150 గం॥ సి.డి.ల రూపంలో దొరుకుతున్నాయి. అవిగాక నిరవధికంగా 12 గం॥ల పాటు అంతర్జాతీయ ప్రమాణాలతో లలితా సహస్రనామ భాష్యము, శ్రీవిద్య – మంత్ర, యంత్ర తంత్ర రహస్యాలు వంటి అంశాల మీద చెప్పిన ఉపన్యాసాలు ప్రపంచ రికార్డులు కూడా అయినాయి. ఈ రకంగా "పైన చెప్పిన లక్షణాలన్నీ నా దగ్గర ఉన్నాయి" అంటారు పెద్దవాళ్ళు. ఈ కారణంగానే శ్రీవిద్యాపరులలో నన్ను కూడ ఒకడిగా భావన చేస్తారు?

# 11. సన్మానాలు-సత్కారాలు

కేవలము శ్రీవిద్యలోనే కాకుండా ఆధ్యాత్మికంగా కూడా ఇంత కృషి చేసిన మీకు సన్మానాలు, సత్కారాలు కూడా బాగానే జరిగాయి కదా? ఒకాయన ప్రశ్న.

ఎందుకు జరగవు? బాగానే జరుగుతాయి. కాకపోతే సన్మానాలు జరుగుతాయి అని ఊహించి ఈ పని చెయ్యలేదు. ఈ పని చేశాను కాబట్టి సన్మానాలు జరిగాయి అంతే.

1. 13-12-1999న కనకాభిషేకము
2. 1-8-1989 స్వర్ణకంకణము
3. 3-11-2002 గండపెండేరము
4. 21-3-2004 ఎ.పి. రాష్ట్ర ప్రభుత్వ ఉగాది పురస్కారము
5. 5-9-2004 ఎ.పి. రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారము
6. 29-5-2005న అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులుగా నియామకం
7. 31-3-2010 ఇండియా కల్చరల్ సెంటర్ టెంపుల్, మెంఫిస్, యు.ఎస్.ఎ ఆస్థాన విద్వాంసులుగా నియామకం.
8. 19-7-2016న శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు.
9. నోరి ఛారిటబుల్ ట్రస్ట్ వారిచే శ్రీవిద్యా పురస్కారం 13-7-2014
10. డా॥ దివాకర వెంకటావధాని గారి 101వ జయంతి సందర్భంగా డా॥ శ్రీమతి ఆర్. గాయత్రి, డా॥ ఆర్. దీక్షితుల అవార్డు 22-7-2013

ఇంకా ఎన్నో, ఎన్నెన్నో సత్కారాలు జరిగాయి. అయితే ఒక్కమాట.

అమ్మవారి దయ మీ మీద ఉన్నది కాబట్టి మీరు ఇన్ని పుస్తకాలు వ్రాశారు. లేకపోతే?

ఆ మాట నిజమే. మీరు చెప్పిన దాంట్లో నిజం లేకపోలేదు. కాని అమ్మవారి అనుగ్రహానికి తోడు మా కృషి కూడా ఉన్నది అనే మాట మరచిపోవద్దు. కేవలము

గతజన్మలో చేసిన కర్మ ఫలితం మీదే ఆధారపడద్దు. ఈ జన్మలో చేసే కృషి చాలా ముఖ్యమైనది. అది మానవుణ్ణి ఏ స్థాయికైనా తీసుకువెడుతుంది. దీనికి అనేకానేకమైన ఉదాహరణలున్నాయి. కాబట్టి **"భగవంతుడు నాకింతే ఇచ్చాడు. నాకు ఇంతే ప్రాప్తం అని చూస్తూ కూర్చునే కన్న ఇది నాకు కావాలి. ఇది నేను చెయ్యాలి. అనే పట్టుదలతో చేస్తే భగవంతుడు కూడా సహకరిస్తాడు."** అనే మాట మనం గుర్తుంచుకోవాలి. అందుకే భగవంతుడి కృపాకటాక్ష వీక్షణాలతో పాటుగా **కృషితో నాస్తి దుర్భిక్షం** కృషి ఉంటే మనుషులు ఋషులౌతారు, మహాపురుషులౌతారు. అనే మాట కూడా గుర్తుంచుకుని సాధన చేస్తే సాధించలేనిది ఏదీ ఉండదు. దేన్నైనా సాధించ లేకపోయామంటే మన ప్రయత్నలోపమే తప్ప వేరేదీ కాదు.

నేను ఇంకా ఇంకా పెద్ద పెద్ద విషయాల మీద పుస్తకాలు వ్రాయాలనీ, ఆ శక్తిని పరమేశ్వరి నాకు అనుగ్రహించాలని కోరుతూ

నేను వ్రాసిన పుస్తకాలు, చెప్పిన ఉపన్యాసాలు ఆదరించిన తెలుగు ప్రజానీకానికి కృతజ్ఞతలు తెలియచేస్తూ వీటన్నింటికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన నా భార్య రమాదేవిని స్మరిస్తూ

బుధజన విధేయుడు

**క్రోవి పార్థసారథి**

9-5-2019

శ్రీ వికారి నామ సంవత్సర

వైశాఖ శుద్ధ పంచమి, గురువారం

శంకర జయంతి

# గురుత్రయము

అప్పటికి నాకు మంత్రోపదేశం లేదు. ప్రతిరోజు రాత్రి కొద్దిసేపు విష్ణుభొట్ల నృసింహ ఘనపాఠి గారి దగ్గర కూర్చునే వాణ్ణి. వారు శ్రీ దుర్గామల్లేశ్వర స్వామి దేవాలయంలో 'మహావిద్య పారాయణ దారు'. అప్పటికే నాకు అభిషేకం చెయ్యటం, లలితా సహస్రము, శ్రీసూక్త, పురుషసూక్త విధానంగా షోడశోపచార పూజా విధానము వచ్చు. ఒకరోజున ఘనపాఠీ గారు 'నీకు పూజా విధానమంతా వచ్చుకదా ? మరి మంత్రంకూడా చెప్పుకో అన్నారు. మంత్రం చెప్పుకుంటే జపం చేసే తీరికా, ఓపికా కూడా నాకు లేవు. అందుకని మంత్రం చెప్పుకోను అన్నాను. ముందు నీ జాతకం పట్టుకు రా. అర్వణం వేసి చూద్దాం. నీకు మంత్రస్థానం ఎలా ఉందో తెలుస్తుంది అన్నారు. మరునాడు నా జాతకం ఇచ్చాను. రెండురోజుల తరువాత 'మంత్రం, సిద్ధము, సుసిద్ధము, సాధ్యము, అరిష్టము అని నాలుగు రకాలుగా ఉంటుంది. నీకు శ్రీవిద్య సుసిద్ధంలో ఉంది అంటే గతజన్మలలోనే సిద్ధించిన మంత్రమది. ఇప్పుడు నువ్వు క్రొత్తగా చెయ్యాల్సింది ఏమీ లేదు. రోజూ పదిసార్లు మంత్రం చెప్పినా చాలు. కాబట్టి మంత్రం చెప్పుకో ఇబ్బంది ఏమీ లేదు. రేపు దసరాలలో మహానవమి రోజున రా. మంత్రం చెబుతాను అన్నారు. సరే అన్నాను.

ఈ లోపల ఇంటికి బందరు వెళ్ళినప్పుడు ఈ విషయం మా తాతయ్య (అమ్మ నాన్న) మేడిచర్ల సత్యన్నారాయణగారితో చెప్పాను. వారు అంతా విని 'ఒరే ! వాళ్ళది కళ్యాణానంద భారతి సప్రదాయం. మన సంప్రదాయం మనకుంది. నీకు మంత్రం నేనే చెబుతాను అని ఆ మరునాడే పంచదశి మంత్రోపదేశం చేశారు. ఇలా అనుకోకుండా మంత్రోపదేశం తీసుకోవటం జరిగింది.

**ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।**
**అఅస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్ ॥**

మా గురుత్రయం విరజానందనాథ, సదానందనాథ, శుకానందనాథులు. మా తాతగారే నా స్వగురువు. మేడిచర్ల సత్యన్నారాయణ గారు. విరజానంద నాథులు. గతంలో గుంటూరులోని శ్రీ శృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ నృసింహానంద భారతి పూర్వాశ్రమంలో వీరికి బావమరిది.

మా పరమగురువు సదానంద నాథులు. కొల్లూరు వాస్తవ్యులు శ్రీకూచిభొట్ల నాగభూషణ శాస్త్రిగారు. మా అమ్మమ్మ తండ్రిగారు. వీరి కుమారుడే నృసింహానంద భారతి (ఘట్టి లక్ష్మీనృసింహశాస్త్రి) మా పరమగురువు. శుకానందనాథులు.

ఇవి నా గురుత్రయం.

అయితే ఉపనిషత్తులు, వేదాంత విషయాలు, బ్రహ్మసూత్రాలు నేను ఎవరి దగ్గరా చెప్పుకోలేదు. ఒకసారి చదివితే అవి నాకు గుర్తుంటాయి. అంతే

## విషయసూచిక

# 1. శ్రీవిద్య

బ్రహ్మపదార్థాన్ని 1.నిరాకారము 2.సాకారము అని రెండు విధాలుగా చెప్పటం జరుగుతోంది.

**1. నిరాకారము :** బ్రహ్మపదార్థానికి ప్రత్యేకంగా ఒకరూపం అనేది లేదు. చరాచర జగత్తంతా పరబ్రహ్మస్వరూపమే. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా పరబ్రహ్మ నాలుగు పాదాలుగా ఉంటుంది.

1. తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. దశదిశలు బ్రహ్మమే.
2. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, పర్వతాలు, లోయలు అన్నీ బ్రహ్మమే.
3. ఆకాశంలో ప్రకాశించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, మెరుపులు అన్నీ బ్రహ్మమే.
4. ప్రాణంబ్రహ్మ దృష్టిబ్రహ్మ, శ్రోత్రంబ్రహ్మ.

దీన్ని బట్టి చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే అనే విషయం తెలుస్తోంది. అలాగే పరమేశ్వరుడు ఎక్కడున్నాడు? అన్నప్పుడు **ఇందుగల డందులేడను సందేహము వలదు ఎందెందు వెతకి చూచిన అందందే గలడు** అంటాడు ప్రహ్లాద కుమారుడు తన తండ్రియైన హిరణ్యకశ్యపుడితో. అంటే పరమేశ్వరుడు, పరబ్రహ్మ సర్వాంతర్యామి. చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు.

సృష్టి ప్రారంభానికి ముందు జగత్తంతా శూన్యంగా ఉండేది. ఆ శూన్యాన్ని ఆక్రమించి ఉన్నాడు పరబ్రహ్మ. సృష్టి జరిగిన తరువాత 84 లక్షల జీవరాశి రూపంలో ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. అందుకే సర్వకాల సర్వావస్థల యందు పరబ్రహ్మ ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నది. జగత్తులోని 84 లక్షల రకాలైన ప్రాణికోటి అంతా పరబ్రహ్మ ప్రతిరూపమే. ఈ రకంగా పరమేశ్వరుడు సర్వాంతర్యామి. అతనికి ప్రత్యేకంగా ఒక రూపంలేదు. అన్ని రూపాలు అతనివే. అందుకే అతడు ఆకారం లేనివాడు. నిరాకారుడు.

మానవుడు మరణ కాలంలో దేన్ని గురించి ఆలోచిస్తాడో, మరణం తరువాత దాన్నే పొందుతాడు. ధనాన్ని గురించి ఆలోచిస్తూ మరణిస్తే, మరుజన్మలో మంచి ధనికుడౌతాడు. స్త్రీని గురించి విచారిస్తూ ప్రాణాలు వదిలితే, మరుజన్మలో స్త్రీగా జన్మిస్తాడు. నిరాకార బ్రహ్మమును గురించి ఆలోచిస్తూ ప్రాణాలు వదిలితే నిరాకారాన్నే పొందుతాడు. అదే సాయుజ్యము, కైవల్యము, మోక్షము అంటారు. సాకార బ్రహ్మను గురించి ఆలోచిస్తూ ప్రాణాలు వదిలితే, సాకార బ్రహ్మను చేరతాడు. అంటే సాకార బ్రహ్మ ఉండే చోటికి చేరతాడు. అదే పరమపదము. మానవుడు పరమపదం చేరటాన్నే ముక్తి అంటారు. ముక్తి పొందిన మానవుడు.

విష్ణు భక్తుడైతే – వైకుంఠం చేరతాడు

శివభక్తుడైతే – కైలాసం చేరతాడు

అమ్మవారి భక్తుడైతే – మణిద్వీపము చేరతాడు

వీటినే పరమపదము అంటారు. మొత్తం మీద తేలింది ఏమంటే సాకార బ్రహ్మను ఉపాసించిన వాడు – పరమపదం చేరతాడు. అంటే ముక్తి పొందుతాడు. నిరాకారోపాసన చేసినవాడు – మోక్షం పొందుతాడు.

**2. సాకారము :** పరబ్రహ్మ నిరాకారము, నిర్గుణము. అయితే రూపంలేని దాన్ని ధ్యానించటం, ఉపాసన చెయ్యటం తేలికైన పనికాదు. మనసు లగ్నంకాదు. అందుచేత సాధకుడు ఒక రూపాన్ని సృష్టించాడు. **సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా.** సాధకుడు తన కోరికలు తీరటం కోసం పరబ్రహ్మకు ఒక రూపాన్ని కల్పించాడు. అదే సాకార బ్రహ్మ. ఈ క్రమంలో కొంతమంది శ్రీమహావిష్ణువే పరమదైవము అన్నారు. వారి దృష్టిలో ఆయనే పరబ్రహ్మ. ముక్తిప్రదాత. ఆయన వైకుంఠంలో ఉంటాడు. కొంతమంది ఈశ్వరుడే పరమేశ్వరుడు అన్నారు. వారి దృష్టిలో ఆయనే పరమేశ్వరుడు. ముక్తిప్రదాత. మరణానంతరము విష్ణుభక్తులు వైకుంఠం చేరితే, శైవులు కైలాసం చేరతారు. మరికొంతమంది పరమేశ్వర తత్త్వాన్ని స్త్రీ రూపంలో ఉపాసించారు. ఆవిడే లలితాత్రిపురసుందరి, రాజరాజేశ్వరీ పరాభట్టారిక. త్రిభువనేశ్వరి. ఆమె మణిద్వీపంలో ఉంటుంది. అమ్మవారి ఉపాసకులు మరణానంతరము మణిద్వీపం చేరతారు. స్త్రీదేవతల మంత్ర తంత్రాలనే 'విద్య' అంటారు. **ముక్తిప్రదాత అయిన పరమేశ్వరిని అర్చించే మంత్ర, యంత్ర, తంత్రాలనే శ్రీవిద్య అంటారు.**

స్త్రీ దేవతలను అర్చించే విధానమంతా శ్రీవిద్య కాదు. దుర్గ, కాళి, చండి, వారాహి, ఛిన్నమస్త మొదలైన వారంతా కోరికలు తీరుస్తారు. అంతేకాని ముక్తిని ప్రసాదించలేరు. అలా ముక్తిని ప్రసాదించగలిగేది శ్రీచక్రనగరసామ్రాజ్ఞి అయిన లలితాత్రిపురసుందరి లేదా రాజరాజేశ్వరి పరాభట్టారిక మాత్రమే. అందుచేత ఆవిడ ఉపాసనలో గల మంత్ర, యంత్ర, తంత్రాలను మాత్రమే **'శ్రీవిద్య'** అంటారు. **దీనిమీద మరిన్ని వివరాలకు నేను వ్రాసిన 'శ్రీవిద్య' పుస్తకం చూడండి.**

శ్రీవిద్యలో మొదటి మంత్రం బాల. ఇది మూడక్షరాల మంత్రం. రెండవది పంచదశి. ఇది పదిహేనుఅక్షరాల మంత్రం. శ్రీవిద్యకు గాయత్రి వంటిది. శ్రీవిద్యలో అత్యంత ప్రాధాన్యత కలిగిన మంత్రం. ఆ తరువాత షోడశి. ఇది పదహారు అక్షరాల మంత్రం. మహాషోడశి అని ఇంకొక మంత్రమున్నది. అది ఇరవైఎనిమిది అక్షరాల మంత్రం. ఉపాసనక్రమంలో కొన్ని సంప్రదాయాల వారు పదహారుఅక్షరాలున్న షోడశి చెబితే, మరికొందరు ఇరవైఎనిమిదిఅక్షరాలున్న మహాషోడశి చెబుతారు. ఈ రెండూ మోక్షకారకాలే. ఈ మంత్రాలలోనే హాదివిద్య, కాదివిద్య, సాదివిద్య అని మూడు రకాలైన మంత్రాలున్నాయి. పంచదశీమహామంత్రం.....

1. హకారంతో మొదలైతే - హాదివిద్య
2. కకారంతో మొదలైతే - కాదివిద్య
3. సకారంతో మొదలైతే - సాదివిద్య

హాదివిద్యలోని మంత్రాలలో లోపాముద్ర ఉపాసించిన మంత్రము, కాదివిద్యలో మన్మథుడు ఉపాసించిన మంత్రము శ్రేష్ఠమైనవి. కాగా ఈ రెండింటినీ పరిశీలిస్తే **కాదివిద్యలోని కామరాజ మంత్రమే శ్రేష్ఠమైనది.**

పంచదశీమహామంత్రానికి శ్రీంకారము లేదా ఈంకారము చేర్చితే, దాన్ని షోడశాక్షరి అన్నారు. ఈ విషయం శంకర భగవత్పాదుల వారు, లొల్లా లక్ష్మీధరుడు కూడా ఒప్పుకున్నారు.

శ్రీవిద్యలో అమ్మవారికి ప్రతిరూపంగా పూజించే యంత్రాన్నే శ్రీచక్రము అన్నారు. ఇది తొమ్మిది ఆవరణలతో ఉంటుంది. తొమ్మిది ఆవరణలలో ఉన్న వివిధ దేవతలను అర్చించటాన్నే **నవావరణార్చన** అంటారు. ఇదే శ్రీచక్రార్చన. శ్రీచక్రము చరాచర

జగత్తుకు, విశ్వమానవాళికీ ప్రతీక. శ్రీచక్రాన్ని అర్చిస్తే చరాచరజగత్తును అర్చించినట్లే. విశ్వమానవాళిని అర్చించినట్లే, శ్రీచక్రం అనేక రకాలుగా ఉంటుంది. 1. భూప్రస్తారము 2.మేరుప్రస్తారము 3.కైలాసప్రస్తారము 4.అర్ధమేరువు 5. ఊర్ధ్వదళము 6. అథోదళము. ఇలా చాలా రకాలున్నాయి. దీనిమీద వివరాల కోసం **శ్రీవిద్య** పుస్తకము, **శ్రీచక్రము** వీడియో చూడగలరు.

అమ్మవారి పూజావిధానంలో తంత్రశాస్త్రాలు ముఖ్యపాత్ర పోషిస్తాయి. అరవై నాలుగు తంత్రాలు ప్రముఖంగా మనకు కనిపిస్తాయి. అయితే ఇవన్నీ లౌకికమైన కోర్కెల సాధనకు ఉపయోగిస్తాయి. కాగా మోక్షసాధనకు ఉపయోగించేవి **శుభాగ పంచకము** అనే 1.సనక 2. సనందన 3. సనత్కుమార 4. సనత్సుజాత, 5. వశిష్ట సంహితలు.

శ్రీవిద్యాపరులు ఎక్కువ మంది చక్రార్చన చేస్తారు. చక్రార్చన అంటే దేవికి చాలా ఇష్టం. సామాన్యంగా షోడశి ఉపదేశమున్నవారే చక్రార్చన చేస్తారు. కాని కొన్ని సంప్రదాయాలలో పంచదశి ఉన్నవారు కూడా చక్రార్చన చేస్తున్నారు. ఇది వారి సంప్రదాయం.

అలాగే **వనదుర్గామహావిద్యాపంచశతి**. ఇది ఐదువందలమంత్రాలు గల మాలామంత్రం. దీనికి అధిదేవత వనదుర్గ. దీనిలో కొన్ని వేదమంత్రాలు కూడా ఉన్నాయి. వాటిని గురుముఖతః చెప్పుకోవాలి. దీనిలోని రెండవ భాగంలోని 27వ మంత్రం **మహాపాదుక.** కాబట్టి పాదుకాంతపూర్ణదీక్షాపరులే దీన్ని పారాయణ చెయ్యాలి. అయితే కేవలము పంచదశిమాత్రమే ఉన్నవారు కూడా వనదుర్గా మహావిద్య పారాయణ చెయ్యటం నేను చూశాను. మీరు ఎలా చేస్తున్నారు? అని అడిగితే "మా గురువుగారు చెయ్యమన్నారు. మహాపాదుక ఉన్నచోట గురుమంత్రం చెప్పమన్నారు" అని సమాధానం చెప్పారు. వాళ్ళ గురువుగారు పెద్దవారు. చదువుకున్న వారు కాబట్టి మనం ఏమీ అనలేం. అది వారి సంప్రదాయం. అంతే. భిన్న సంప్రదాయాలున్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమే పాటించాలనేది ఆర్యోక్తి. అలాగని శాస్త్ర విరుద్ధంగా చేస్తే ఇబ్బందులు ఎదురు కావచ్చు. జాగ్రత్త.

**చండీ సప్తశతి.** ఇది ఏడువందల శ్లోకాలు గల మాలామంత్రం. దీనికి అధిదేవత చండి. కాబట్టి చండీనవాక్షరి ఉపదేశం ఉన్నవారు ఎవరైనా దీన్ని పారాయణ చెయ్యవచ్చు.

శ్రీవిద్యాపరులంతా పారాయణ చేసేది లలితా సహస్రము. దీనికి అధిదేవత లలితా త్రిపురసుందరి. ఆఖరు శ్లోకంలో **శ్రీశివా శివశక్త్యైక్యరూపిణి లలితాంబికా** అన్నారు. అయితే షోడశిసహస్రనామం వేరే ఉన్నది. ఇది 152 శ్లోకాలుగా ఉంటుంది.

**కళ్యాణీ కమలాకాళీకరాళీ కామరూపిణీ**
**కామాఖ్యా కామదా కామ్యా కామనా కామచారిణీ**

కాని ఎక్కువమంది శ్రీవిద్యాపరులు లలితాసహస్రాన్నే పారాయణ చేస్తారు.

శ్రీవిద్యలో ప్రముఖమైనది చక్రార్చన. శ్రీచక్రంలోని నవావరణలలోను ఉండే దేవతలను పేరుపేరునా అర్చించటాన్నే నవావరణార్చన లేదా చక్రార్చన అంటారు. ఈ దేవతలందరిపేర్లు ఖడ్గమాలలో చెప్పబడ్డాయి. ముందుగా న్యాసము చెప్పుకుని, షోడశనిత్యలను అర్చించి, గురుమండలాన్ని అర్చించి, ఆ తరువాత తొమ్మిది ఆవరణలలో ఉండే దేవతలను పేరుపేరునా అర్చించి ధూపదీప నైవేద్యాలు సమర్పించాలి. తొమ్మిదవ ఆవరణలో. మహాకామేశ్వరి, మహాకామేశ్వరులను అర్చించిన తరువాత వారి వెసులుబాటునుబట్టి లలితాసహస్రనామ పారాయణ, శ్రీయాగము చేస్తారు.

ఆవరణార్చన అన్ని సంప్రదాయాలవారికి ఒకటే. కాకపోతే పాత్రాసాధనలోనే తేడాలున్నాయి. చక్రార్చనకు ఒకపాత్ర దగ్గర నుండి ముప్పైపాత్రల వరకు పెట్టే వారున్నారు. ఇవన్నీ వారి వారి సంప్రదాయాలు.

చక్రార్చనకు గుంటూరులోని **శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష పీఠం** పెట్టింది పేరు. ఇది **కళ్యాణానంద భారతి వారి పీఠంగా ప్రసిద్ధి.** ఇక్కడ అందరూ శ్రీవిద్యోపాసకులే, పాదుకాంత పూర్ణదీక్షాపరులే. ఆంధ్రదేశంలో కళ్యాణానంద భారతి సంప్రదాయమే ఎక్కువ ప్రాచుర్యంలో ఉంది. ప్రస్తుత కాలంలో శ్రీవడ్లమూడి వేంకటేశ్వరరావు గారు ఈ పీఠానికి సంబంధించిన ప్రముఖ శ్రీవిద్యోపాసకులు. పోతుకూచి శ్రీరామ్మూర్తి గారి వంటి వారు కూడా ఈ పీఠానికి సంబంధించిన వారే. కళ్యాణానందభారతి శిష్యులే. శ్రీవిద్యలో చక్రార్చనకు పేరెన్నికగన్నది ఈ పీఠం. ఇప్పటికి కూడా ప్రతిమాసంలోను అష్టమి, పౌర్ణమి, మూలానక్షత్రం వంటి రోజులలో ఈ పీఠంలో చక్రార్చన జరుగుతుంటుంది. శ్రీవిద్యకు సంబంధించిన ప్రముఖ పీఠం అంటే బహుశా ఇదేనేమో?

చివరగా ఒక మాట. ఒక సంప్రదాయంలో ఉన్నప్పుడు ఇతర సంప్రదాయాల లోని మంత్రాలు, ధర్మాలు, ఆచారాలు మనం ఆచరించవచ్చా? **మంచి విషయాలు ఎక్కడున్నా గ్రహించవచ్చు** అనేది ఆర్యోక్తి. పద్మం బురదలో పుట్టినంత మాత్రం చేత దాన్ని వదిలెయ్యం. జాతిరత్నం పెంటదిబ్బలో దొరికినా తీసుకుంటాం. అలాగే గొప్ప విషయాలు ఏ సంప్రదాయంలో ఉన్నా మనం గ్రహించవచ్చు. బ్రహ్మసూత్రాల లోని మూడవ అధ్యాయం, మూడవపాదంలోని రెండవ అధికరణ **ఉపసంహారాధికరణము.** ఇందులో ఒక శాఖలోని గుణాలు, ధర్మాలు వేరొకశాఖలోకి అన్వయించవచ్చన్నాడు వ్యాసభగవానుడు.

శ్రీవిద్యాపరులంతా అత్యంత శ్రద్ధగా చదివేది, శ్రీచక్రంలోని నవావరణలలోని దేవతలను వివరించేది అయిన **ఖడ్గమాల** వామకేశ్వర తంత్రంలోది. ఈ తంత్రం వామాచారులకు అత్యంత ప్రామాణికము. అంత మాత్రంచేత ఖడ్గమాలను వదలి వెయ్యలేదు కదా? అలాగే నాభీవిద్యకూడా, దీనికి ఆనంద భైరవుడు ఋషి. వామాచార పరాయణుడు. అంత మాత్రం చేత దీన్ని కాదనాల్సిన పనిలేదు. షోడశిహృదయానికి కూడా ఆనందభైరవుడే ఋషి. మనం మంత్రాన్ని ఉపాసిస్తున్నాము అంతేకాని వామాచారం చెయ్యటం లేదు.

**యత్రాపి భోగో నచతత్రమోక్షః యత్రాపిమోక్షో నచతత్రభోగః**

**శ్రీసుందరీసేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్త ఏవ ॥**

లోకంలో భోగం కావాలంటే, మోక్షముండదు. మోక్షం కావాలంటే భోగముండదు. కాని అమ్మవారిని అర్చించేవారు మాత్రం జీవించినంత కాలం సుఖాలనుభవించి, మరణానంతరము మోక్షం పొందుతారు. అది శ్రీవిద్య గొప్పతనం.

ముందుగా నా గురుదేవులైన **విరజానందనాథ, సదానందనాథ, శుకానంద నాథులకు** సాష్టాంగ దండ ప్రమాణాలాచరించి, శ్రీవిద్యాపరులందరికీ శతసహస్ర వందనాలర్పించి, ఎక్కడో మరుగునపడిపోయిన నాభీవిద్యను మీ ముందుకు తెస్తున్నాను, మంత్ర శాస్త్రంలో ఇది కొన్నివందల అణుబాంబులతో సమానమైనది. పాదుకాంతపూర్ణదీక్షాపరులు కానివారు దీన్ని పారాయణ చెయ్యటానికి సాహసించవద్దు. కేవలము ఇంత గొప్పవిద్య నాశనం కాకూడదనే దృష్టితోనే దీన్ని మీ ముందుకు తెస్తున్నాను.

# ౨. శ్రీవిద్య తాంత్రికమా? ... వైదికమా?

చాలారోజులక్రితం జరిగిన యధార్థ సంఘటన.

ఒకసారి విజయవాడలో టి.టి.డి. కళ్యాణ మంటపంలో మా తోటి లెక్చరర్ గారి కుమార్తె వివాహానికి వెళ్ళాను. పెండ్లికుమారుడి వైపువారంతా శ్రీవిద్యా పూర్ణదీక్షాపరులు. ఆచారాలు, సంప్రదాయాలు కూడా కొంచెంఎక్కువే. వాళ్ళ గురువుగారు కౌతానరశింహశాస్త్రి గారు, గుంటూరు హిందూ కాలేజిలో లెక్చరర్‌గా పనిచేసి పదవీవిరమణ చేశారు. దాంతో వాళ్ళ గురువుగారిని, తోటి సహోధ్యాయులని, వేదపండితులని చాలామందిని వివాహవేడుకకు పిలిచి సత్కరించారు పెండ్లికుమారుని తల్లిదండ్రులు. నరసింహశాస్త్రి గారు పెద్దవారు. 70 సంవత్సరాలు దాటాయి. ఆయన గొప్ప శ్రీవిద్యోపాసకులని పేరు. శ్రీవిద్యకు సంబంధించి కొన్ని గ్రంథాలు కూడా వ్రాశారు. అందరిలోకి పెద్దవారు. చదువుకున్న వారు అందరికీ పరిచయస్తులు.

సన్మానకార్యక్రమం పూర్తయింది. వేదపండితులు కొంతమంది ఆయన దగ్గరకు వచ్చి 'ఏం మావాఁ ! బాగున్నావా?' అంటూ పలకరించారు. మాటల సందర్భంలో విషయం శ్రీవిద్య మీదకి మళ్ళింది. వేదపండితులంతా ఒక్కసారిగా మూకుమ్మడి దాడి చేశారు నరశింహశాస్త్రి గారి మీద. శ్రీవిద్య పూర్తిగా తాంత్రిక విద్య. కావాలంటే నిరూపిస్తాము. భోజనాలయిన తరువాత, సాయంత్రం ఐదుగంటలకు కూచుందాం. ధైర్యం ఉంటే రా ! అంటూ సవాలు విసిరారు. వాళ్ళు పదిమంది ఉన్నారు. గోలగోలగా అరుస్తున్నారు. నరసింహశాస్త్రి గారు ఒక నవ్వు నవ్వి ఊరుకున్నారు. తరువాత భోజనాలు చేసి ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు గునుపూడి జంగాలు మాదిరిగా. అంతకు మించి ఏమీ జరగలా. అంతవరకు శ్రీవిద్య వైదికమా? తాంత్రికమా ? ఈ అనుమానం నాక్కుడారాలా ! అప్పుడే మొదటిసారి దాన్ని గురించి ఆలోచించాను. ఇంతకీ శ్రీవిద్య వైదికమా? తాంత్రికమా?

ఈ విషయం తెలుసుకోవాలంటే ముందుగా వైదికమంటే ఏమిటి? తాంత్రికమంటే ఏమిటి? అనే విషయాలు తెలుసుకోవాలి. మంత్రశాస్త్రంలో

**వైదికా ప్రణవైర్యుతా ప్రణవేనవిహీనంతు తాంత్రికా ఏవః పరికీర్తితా ॥**

ప్రణవము అంటే ఓంకారము. మంత్రంలో గనక ఓంకారమనేది ఉంటే అది వైదికము అని, ఓంకారం లేకపోతే తాంత్రికము అని సూత్రము. శ్రీవిద్యలోని ప్రధానమైన బాల, పంచదశి, షోడశి మంత్రాలలో ఓంకారం కనిపించదు. ఈ కారణం చేతనే శ్రీవిద్యను తాంత్రికవిద్య అంటారు.

వేదంలో చెప్పిన విద్యను వేదవిద్య, వైదికము అంటారు. వేదంలోని చివరి భాగమైన ఉపనిషత్తులలో విద్యలు (మంత్రాలు, ఉపాసన) చెప్పబడ్డాయి. ఉదాహరణకి **నారాయణోపనిషత్తులో నారాయణ మంత్రం** అష్టాక్షరి చెప్పబడింది.

**ఓమిత్యేకాక్షరం, నమ ఇతి ద్వేక్షరే, నారాయణేతి పంచాక్షరాణి । ఏతద్వై నారాయణ స్యాష్టారం పదమ్** అలాగే **గోపాలతాపినీ ఉపనిషత్తులో క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ స్వాహా** అంటూ గోపాల మంత్రం చెప్పబడింది. ఈ విధంగా ఎక్కడా శ్రీవిద్యా మంత్రాలు చెప్పబడలేదు కాబట్టి శ్రీవిద్య వేదవిద్య కాదు అని వారి వాదన.

ఇది కేవలము అవగాహనాలోపం. మేమే గొప్పవారం అనే చిన్న అహంకారం. మీరు చెప్పేది తప్పు. మీకేమీ తెలియదు అనే చులకనభావం. అంతకన్నా ఏమీకాదు. ముందుగా శ్రీవిద్యలో ప్రణవము ఉన్నదో లేదో చూద్దాం.

ఓంకారము ప్రణవము. అలాగే శాక్తేయంలో శక్తిప్రణవాలు అని ప్రత్యేకంగా ఉన్నాయి. అవి **శ్రీం హ్రీం క్లీం ఐం సౌః.** ఈ ఐదు శక్తి ప్రణవాలు. బాలా మంత్రంలో ఐం క్లీం సౌః ఈ మూడూ ప్రణవాలే ఉంటాయి. షోడశి మహామంత్రంలో పంచదశి మహా మంత్రానికి ముందు ఎనిమిది, తరువాత ఐదు బీజాక్షరాలుంటాయి. శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం ఇందులో ఏడుశక్తి ప్రణవాలు, కాగా ఎనిమిదవది ఓంకారము. చివర ఉండే ఐదు **సౌః ఐం క్లీం హ్రీం శ్రీం** ఇవన్నీ శక్తి ప్రణవాలు. ఈ రకంగా షోడశి మహామంత్రంలో ఓంకారంతో పాటుగా పన్నెండు శక్తి ప్రణవాలున్నాయి. అంటే మొత్తం పదమూడుసార్లు ప్రణవం చెప్పబడింది. మరి ఇంత గొప్ప మంత్రం ఇంకెక్కడుంటుంది? ఏ మంత్రంలోనైనా ఇన్నిసార్లు ప్రణవాన్ని చెప్పటం జరిగిందా? ఒకసారి ఆలోచించండి. ఇక వేదంలో శ్రీవిద్యను చెప్పారా? ఈ విషయం చూద్దాం. వేదంలోని సంహితలో కాకుండా, మంత్ర తంత్రాలన్నీ ఉపనిషత్తులలో చెప్పారు.

ఋగ్వేదానికి సంబంధించిన **త్రిపురోపనిషత్తు**లోని రెండవ మంత్రం చివరలో

**కామోయోనిః కమలావజ్రపాణిః గుహాహసా మాతరిశ్వాఽభ్రమింద్రః పునర్గుహా సకలా మాయయాచ పురూచ్యేషా విశ్వమాతాది విద్యా**

ఇక్కడ సాంకేతిక పదాలతో శ్రీవిద్య చెప్పబడింది. అది ఎలా ? అంటే –

**కామో (క) యోనిః (ఏ) కమలా (ఈ) వజ్రపాణి (ల) గుహా (హ్రీం)**

**హసా (హస) మాతరిశ్వా (క) భ్ర (హ) మింద్రః (ల) పునర్గుహా (హ్రీం)**

**సకలా (సకల) మాయయా (హ్రీం)**

**ఇది ఉపనిషత్తులో చెప్పబడిన పంచదశిమహామంత్రం.**

**త్రిపురతాపినీ ఉపనిషత్తు**లోని మొదటి అధ్యాయంలో గాయత్రీ మంత్రము, పంచదశీ మహామంత్రము ఒకటే అని నిరూపించారు. అలాగే **త్రిపురసుందరీ ఉపనిషత్తు**లో దక్షిణామూర్తి ఋషిః । పంక్తి ఛ్ఛందః । లలితాత్రిపురసుందరీ దేవతా। ఐం బీజం । సౌః శక్తిః । క్లీం కీలకమ్. క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం। స క ల హ్రీం ॥ ఇతి మంత్రః అని చెప్పబడింది.

ఈ రకంగా శ్రీవిద్యామంత్రాలలో ప్రణవము ఉన్నది. పంచదశి మహామంత్రము ఉపనిషత్తులలో ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ కుడా చెప్పబడింది. అటువంటప్పుడు ఇంక శ్రీవిద్య వేదవిద్య కాక తాంత్రిక విద్య ఎలా అవుతుంది? ముమ్మాటికీ శ్రీవిద్య వేదవిద్యే. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు.

# 3. బాలామంత్రము

శ్రీవిద్యలో మొదటగా చెప్పేది బాలామంత్రము. ఎవరీ బాల? ఈ విషయం ఒకసారి చూద్దాం.

బ్రహ్మమానసపుత్రుడు కశ్యపప్రజాపతి. అతడికి దితివల్ల జన్మించిన వాడు వజ్రాంగుడు. ఇతనిభార్య వరాంగి. వీరికుమారుడు తారకుడు. బ్రహ్మనుగురించి ఘోరమైన తపస్సుచేసి, ఈ సృష్టిలో ఉన్న ఏ జీవివల్లా మరణం లేకుండా వరం పొందాడు. వరబలంతో విర్రవీగిపోయాడు. దేవతలను, తాపసులను నానాబాధలు పెడుతున్నాడు. వీరంతా విష్ణుమూర్తిని శరణువేడారు. విష్ణువు దేవతలను, ఋషులను వెంటపెట్టుకుని హిమాలయాలకువెళ్ళి, అక్కడ పరాశక్తినిగూర్చి పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశారు. అప్పుడు ఆ దేవి వారికి ప్రత్యక్షమై, తనఅంశ హిమవంతుని ఇంట కుమార్తెగా పుడుతుంది, “ఆ బాలికకు, ఈశ్వరుడికి వివాహం చెయ్యండి. వారికి కలిగే బాలుడు తారకాసురసంహారం చేస్తాడు” అని చెప్పింది.

దక్షయజ్ఞంలో దాక్షాయణి దగ్ధమైపోయిన తరువాత, ఈశ్వరుడు విరాగియై, హిమాలయాల్లో తపస్సు చేస్తున్నాడు. ఇక్కడ హిమవంతుని కుమార్తె హైమవతికి వివాహ ప్రయత్నాలు చేస్తున్నాడు హిమవంతుడు. ఈశ్వరుణ్ణి తప్ప ఇంకెవరినీ వివాహం చేసుకోనని తెగేసి చెప్పింది హైమవతి. ఆ సమయంలో ఈశ్వరుడి పైన బాణాలు ప్రయోగించాడు మన్మథుడు. దానికి కోపగించి, తన మూడవ కన్నుతో మన్మథుణ్ణికాస్తా భస్మంచేశాడు ఈశ్వరుడు.

ఆ సమయంలో చిత్రకర్ముడైన గణేశుడు ఆ బూడిద నుంచి బొమ్మను తయారుచేసి, దాన్ని బ్రహ్మదేవుడికి చూపించి ఎలాఉంది? అని అడిగాడు. **‘భండ భండ’** (బాగు బాగు) అని దానికి ప్రాణం పోశాడు బ్రహ్మదేవుడు. రుద్రుని కోపాగ్నికి భస్మమైన మన్మథుడి బూడిద నుంచి పుట్టినవాడు కాబట్టి తమోగుణ ప్రధానుడైనాడు. అతడికి భండుడు అని నామకరణం జరిగింది. అతడే భండాసురుడు.

భండాసురుడు దేవతలమీద యుద్ధం ప్రకటించాడు. ముల్లోకాలు జయించాడు. ఋషులను, మునులను, దేవతలను నానాబాధలు పెడుతున్నాడు. భండాసురుణ్ణి సంహరించటానికి సాక్షాత్తు పరమేశ్వరియే చతురంగ బలాలతోను బయల్దేరింది.

పోరు ఘోరంగా సాగుతోంది. భండాసురుని ముప్ఫైమంది కుమారులు చాలా గొప్పగా యుద్ధం చేస్తున్నారు. వారిని సంహరించటానికి ఆ పరమేశ్వరిఅంశగా తొమ్మిది సంవత్సరాల బాలిక ఆవిర్భవించింది. ఆ బాలికయే బాలాత్రిపురసుందరి.

**అరుణకిరణ జాలై రంచితాశావకాశా**
**విధృతజపటీకా పుస్తకాభీత హస్తా ।**
**ఇతర వరకరాఢ్యా పుల్లకల్హారసంస్థా**
**నివసతు హృదిబాలా నిత్య కల్యాణ శీలా ॥**

సంకల్ప మాత్రం చేతనే ఆవిర్భవించి, రాక్షస సంహారం చేసిన బాలాత్రిపుర సుందరి ఉపాసన అభీష్టప్రదము. శరన్నవరాత్రులలో ప్రతిరోజు ఉదయం బాల అర్చన జరుగుతుంది. మొదటిరోజు రెండుసంవత్సరాల బాలిక నుంచి, తొమ్మిదవ రోజు పదిసంవత్సరాలబాలిక వరకు అర్చన చేస్తారు. ఈ రకంగా చేసిన బాలాపూజ వల్ల గొప్ప ఫలితము ఉంటుంది. తొమ్మిది రోజులు పూజించే బాలికలకు విడివిడిగా పేర్లు కూడా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| మొదటి రోజు | కుమారీ | దారిద్ర్య, దుఃఖ నాశనము |
| రెండవ రోజు | త్రిమూర్తి | దీర్ఘాయువు, పురుషార్థాలు |
| మూడవ రోజు | కళ్యాణి | విద్య, రాజభోగము |
| నాల్గవ రోజు | రోహిణి | రోగనాశనము |
| ఐదవ రోజు | కాళి | శత్రునాశనము |
| ఆరవ రోజు | చండిక | సంపత్కరము |
| ఏడవ రోజు | శాంభవి | రాజపూజ్యము, ధీశక్తి |
| ఎనిమిదవ రోజు | దుర్గ | కష్టమైన కార్యసాధన |
| తొమ్మిదవ రోజు | సుభద్ర | అభీష్ట ఫలదాయిని |

ఈ రకంగా దసరా తొమ్మిదిరోజులు రజస్వలకాని బాలికను పూజించటాన్నే **బాలాపూజ, కుమారీపూజ** అని కూడా అంటారు.

బాలామంత్రంలో మూడు బీజాలుంటాయి.

**వాగ్భవం ప్రథమ బీజం । కామరాజం ద్వితీయకం**
**తృతీయం శక్తి కూటాఖ్యం । నిగమ త్రితయోద్ధృతం**
**ఇత్థంకుమారీ విద్యయా బీజత్రయ ముదీరితం ॥**

ఐం – వాగ్భవ బీజము

క్లీం – కామరాజ బీజము

సౌః – శక్తి బీజము

ఈ మూడు బీజములే బాలామంత్రము. ఈ బీజాక్షరాలను దుర్వాసుడు తన దేవీమహిమ్నస్తుతిలో వివరించాడు. ముందుగా వాగ్భవబీజము **ఐం**

**వందే వాగ్భవ మైందవాత్మ సదృశం వేదాది విద్యాగిరో**
**భాషా దేశ సముద్భవాః పశుగతా శ్ఛందాంసి సప్తస్వరాన్**
**తాలా నృత్య మహోధ్వనీ న్ప్రకటయ త్యాత్మ ప్రసారేణయత్**
**తద్బీజం పదవాక్య మానజనకం శ్రీమాతృకే తే పరమ్ ॥**

ఓ పరాత్పరీ నీ రూపమే అయిన వాగ్భవబీజానికి నమస్కరిస్తున్నాను. ఇది శ్వేతవర్ణము గలిగి, వేదాది సకలవిద్యలను, సకలవాక్కులను, సకలభాషలను, సకల ఛందస్సులను, సప్తస్వరాలు, తాళములు, ధ్వనులు అన్నింటినీ ప్రకాశింప చేస్తోంది. ఇంత మహాశక్తిశాలి అయిన వాగ్భవబీజాన్ని నేను ఉపాసిస్తున్నాను.

ఇప్పుడు రెండవదైన కామరాజబీజము – **క్లీం**

**కామాన్కారణతాం గతా నగణితాన్ కార్యై రనేకైర్మహీ**
**ముఖ్యైః సర్వమనోగతా నధిగతాన్ మానై రనేకై స్ఫుటం**
**కామక్రోధ సులోభమోహ మదమాత్సర్యాది షట్కంచ య**
**ద్బీజం భ్రాజయతి ప్రణౌమి తదహం తే సాధు కామేశ్వరీ ॥**

ఓ దేవీ ! కామరాజ బీజము సృష్టి స్థితి లయాలను నిర్వహించే త్రిమూర్తుల శక్తులను ప్రకాశింప చేస్తుంది. పంచభూతాలు, తన్మాత్రలు, త్రిమూర్తులు, సృష్టి స్థితి లయాలు, ఆయా దేవతల శక్తులను గోచరింప చేస్తుంది. అరిషడ్వర్గాలను జీవుల మనసుల యందు ఉత్పన్నము చేస్తుంది. అటువంటి కామరాజ బీజాన్ని ఉపాసిస్తున్నాను.

ఇప్పుడు మూడవదయిన శక్తి బీజము – సౌః

**స్వాత్మశ్రీ విజితాజ విష్ణు మఘవ శ్రీపూరణైక వ్రతం**
**యద్విద్యా కవితా వితానలహరీ కల్లోలినీ దీపకం**
**బీజం యత్రిగుణ ప్రవృత్తి జనకం బ్రహ్మేతి యద్యోగినః**
**శాంతా సత్యముపాసతే తదిహతే చిత్తే దధే శ్రీపరే ॥**

తల్లీ ! శక్తి బీజము త్రిమూర్తుల రూప విశేషాలను జయిస్తున్నది. వారు వారి పనులు సక్రమంగా నిర్వహించటానికి వారికి శక్తినిస్తుంది. ఉపాసకులకు విద్య, కవిత్వము సిద్ధింపచేస్తుంది. త్రిగుణాల ప్రవృత్తి కలిగిస్తుంది. యోగులకు సత్యాత్మకమైన బ్రహ్మము ఇదే. అటువంటి నీ శక్తిబీజాన్ని ఉపాసిస్తున్నాను.

ఈ మూడు శ్లోకాలలోను బాలామంత్రంలోని మూడు బీజాక్షరాల గొప్పతనాన్ని వివరించాడు దుర్వాసుడు. ఇంతగొప్పదనం గలిగిన బాలామంత్రాన్ని ఉపాసన చేస్తే అమోఘమైన ఫలితం వస్తుంది. సాధకుడి అన్ని కోరికలు తీరతాయి. బాలా మంత్రంలో అనేక రకాలున్నాయి. వాటిలో కొన్నింటిని చూద్దాం.

ఈ మంత్రాలన్నింటికీ దక్షిణామూర్తి ఋషిః గాయత్రీఛందస్సు, బాలాత్రిపురసుందరి దేవతా.

1. ఐం క్లీం సౌః – మూడు అక్షరాలు
2. హ్రీం క్లీం హ్ సౌః – మూడు అక్షరాలు
3. ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం – ఆరు అక్షరాలు
4. శ్రీం క్లీం హ్రీం ఐం క్లీం సౌః హ్రీం క్లీం శ్రీం – తొమ్మిది అక్షరాలు
5. ఐం క్లీం సౌః సౌః క్లీం ఐం ఓం హ్రీం శ్రీం – తొమ్మిది అక్షరాలు
6. ఐం క్లీం సౌః బాలా త్రిపురే స్వాహా – పది అక్షరాలు
7. ఐం క్లీం హ్ సౌః బాలా త్రిపురే సిద్ధిందేహి నమః – 14 అక్షరాలు
8. హ్రీం శ్రీం క్లీం త్రిపురాభారతీ కవిత్వందేహి స్వాహా – 16 అక్షరాలు
9. శ్రీం హ్రీం క్లీం త్రిపురమాలినీ మహ్యాం సుఖం దేహి స్వాహా – 17 అక్షరాలు
10. హ్రీం హ్రీం హ్రీం ప్రౌఢ త్రిపురే ఆరోగ్యమైశ్వర్యం దేహి స్వాహా – 18 అక్షరాలు
11. హ్రీం శ్రీం క్లీం త్రిపురామదనే సర్వశుభం సాధయ స్వాహా – 18 అక్షరాలు

## 11. బాలా మాలామంత్రము

ఓం నమో భగవతి బాలాత్రిపురసుందరి అయుత సహస్రకోటి రుద్రగణసేవితే ప్రతాపిని జ్వల2ప్రజ్వల2మమ శత్రుతత్పుత్రకళత్ర బంధుసంక్షయంకురు2ఫట్స్వాహా1 నుద 2పశ్చిమదిశం ధ్వంసయ2ఉత్తరదిశం నిరోధయ2పూర్వదిశం సంహారయ2దక్షిణదిశమనుత్పాదయ2భూత ప్రేతపిశాచ బ్రహ్మరాక్షస బేతాళ సర్వదేవతాప్రయోగాన్ ఛేదయ2 సకలప్రయోగా న్మారయ2 సకలవిషా న్నాశయ2 మహాత్రిపురసుందరి చతుర్దశ విద్యాః ప్రథయ2 నిఖిలఋషిగణసేవితే, లక్షకోటి రవిశశ్యాది మహాతేజస్స్వరూపధారిణి, నవకోటిశక్తిగణసేవితే, ఆనందరూపిణి, మమాభయందేహి2 సర్వదారిద్ర్యప్రశమనం కురు2 మమపుత్ర మిత్ర బంధూనాం క్షేమం కురు2 కల్పవృక్ష కామధేనూ ర్దేహి2 ఆం హ్రీం శం శం శ్రీం శ్రీం శ్రీం ఐం ఐం ఐం క్లీం క్లీం క్లీం సౌః సౌః సౌః క్లీం హుం హ్రీం హుం హ్రైం హుం హుం ఫట్స్వాహా । విజ్వల భిద కుండలినీస్వరూపిణి సకలకామినీ ర్మమవశంకురు 2 సకలదురాచారపురుషా న్నిహన 2 భక్ష2 సకల మూషకాది ప్రయోగాన్ ఛేదయ 2 సకలరాజా న్మమవశం కురు2 సకలరాజసైన్యాని మమ వశంకురు ఉ హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఫట్స్వాహా ॥

**బాలా హృదయం :**

ఆం హ్రీం క్రోం । సౌః ఐం క్లీం । సౌః శ్రీం హ్రీం । బాలపరమేశ్వరి ఆవేశయ ఆవేశయ, ఆం హ్రీం క్రోం సౌః మమ హృదయే చిరం తిష్ఠతిష్ఠ హుం ఫట్ స్వాహా॥

ఇవే కాక ఇంకా అనేక రకాలైన మంత్రాలు, మాలామంత్రాలు కూడా ఉన్నాయి. బాలామంత్రాన్ని ఉపాసించిన వారికి అద్భుతమైన వాక్కు వస్తుంది. అందము, ఆకర్షణీయమైన శరీరం కలుగుతుంది. ఎంత కష్టమైన పనైనాసరే సాధించగల శక్తి కలుగుతుంది.

# 4.పంచదశీ మహామంత్రము

ఇది పదిహేను అక్షరాలు గల మంత్రము. శ్రీవిద్యలో ప్రసిద్ధమైనది. శ్రీవిద్యకు గాయత్రి వంటిది. గాయత్రీ మంత్రము బ్రాహ్మణుల కోసం ఏర్పడగా **పంచదశి మహామంత్రము అన్ని వర్ణాలవారికీ ఉపాశ్యము** అని అగస్త్యమహర్షి తన **'శ్రీవిద్యా దీపిక'** అనే గ్రంథంలో వ్రాశారు. కాబట్టి పంచదశీ మహామంత్రాన్ని బ్రాహ్మణులతో పాటుగా ఇతరులు ఏ జాతివారైనా, ఏ మతం వారైనా, ఏ కులం వారైనా చెయ్యవచ్చు. అయితే మంచి గురువుదగ్గర ఉపదేశం పొంది, మంత్రోపాసన చేస్తే మంచి ఫలితం ఉంటుంది. ఇక్కడ ఇంకొక విషయం ఏమంటే – జపం చేసేటప్పుడు, మంచి ఫలితం రావాలి అనుకున్నప్పుడు మంత్రము యొక్క పూర్వాపరాలు, దాని అర్థము, మంత్రాధిష్ఠాన దేవత, ఇవన్నీ క్షుణ్ణంగా తెలియాలి. మంత్రార్థం తెలియకుండా ఉపాసన చేస్తే, ఆ ఉపాసనకు ఫలితముండదు. అగ్నిహోత్రం లేని బూడిదలో నెయ్యి వేస్తే, ఏ రకంగా ఫలితముండదో, అలాగే అర్థం తెలియకుండా చేసిన మంత్రజపం వ్యర్థమై పోతుంది. అంతేకాదు. **"అర్థం తెలియకుండా శబ్దం పలికేవాడు, గంధపు చెక్కలు మోస్తూ కూడా వాటి వాసన గ్రహించలేని గాడిద వంటివాడు"** అంటారు భాస్కరరాయల వారు. కాబట్టి మంత్రార్థం పూర్తిగా తెలుసుకుని మాత్రమే మంత్రజపం చెయ్యాలి.

మంత్రజపం వల్ల రెండు రకాల ఫలితం వస్తుంది. 1.ఇహము 2.పరము. ఇక్కడ గుర్తించవలసిన విషయం ఏమంటే, ఇహం కావాలంటే పరం ఉండదు. అలాగే పరం కావాలంటే ఇహం ఉండదు.

**యత్రా పి భోగో నచతత్ర మోక్షః యత్రాపి మోక్షో నచతత్ర భోగః**
**శ్రీసుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్తయేవ ॥**

కాని అమ్మవారికి సంబంధించిన పంచదశి మహామంత్రము ఇహాన్ని పరాన్ని కూడా ఇస్తుంది.

దేహము 1.స్థూలదేహము 2.సూక్ష్మదేహము 3.కారణదేహము అని మూడు రకాలుగా ఉంటుంది. అదే దేవత విషయంలో చూస్తే....

1. స్థూలదేహము - అమ్మవారి యొక్క విగ్రహరూపము
2. సూక్ష్మదేహము - అమ్మవారి మంత్రము
3. కారణ దేహము - అమ్మవారి యంత్రము

ఈ సూక్ష్మదేహము మళ్ళీ మూడు విధాలుగా ఉంటుంది.

1. సూక్ష్మము - పంచదశి మహామంత్రము
2. సూక్ష్మతరము - కామకలాక్షరము
3. సూక్ష్మతమము - కుండలినీశక్తి

పంచదశీ మహామంత్రము మూడు కూటములుగా మూడు భాగాలుగా ఉంటుంది. అవి

1. వాగ్భవకూటమి 2. కామరాజకూటమి 3. శక్తికూటమి. లలితా సహస్రంలో 85, 86, 87 నామాలలో పంచదశీ మహామంత్రాన్ని వివరించారు.

85. శ్రీమద్వాగ్భవకూటైక ముఖపంకజా,

86. కంఠాదికటిపర్యంతం మధ్యకూటస్వరూపిణీ

87. శక్తికూటైకతాపన్న కట్యథోభాగధారిణః

వీటిలో

1. వాగ్భవకూటమి శిరస్సు. ఇది ఋగ్వేదాత్మకము

శిరస్సు నుంచే పరావాక్కు ఉత్పన్నమయి నోటిద్వారా బయటకు వస్తుంది. అందుకే ఇది వాక్కుయొక్క భాగము 'వాగ్భవకూటమి' అంటారు.

2. కామరాజకూటమి - కంఠం నుంచి కటిప్రదేశం వరకు. ఇది యజుర్వేదాత్మకము

శరీరంలోని ఈ భాగంతోనే జీవి తనకోరికలు అనుభవిస్తుంది. అందుకే దీన్ని మన్మథభాగము, కామరాజకూటమి అంటారు.

3. శక్తికూటమి - కటిప్రదేశం నుంచి పాదాల వరకు. ఇది సామవేదాత్మకము. జీవి సంచరించటానికి అవసరమైన శక్తిగల కాళ్ళు ఇక్కడ ఉంటాయి. అందుకే ఇది శక్తికూటమి.

పంచదశి మహామంత్రము దేవికి ఆత్మస్వరూపము. శ్రీవిద్యకు ఇది గాయత్రి వంటిది అని గతంలోనే చెప్పుకున్నాం. ఇది ఆత్మసాక్షాత్కారం కలిగించి మోక్షానిచ్చే మంత్రము, చతుర్విధ పురుషార్థాలకు మూలము, అందుకే దీన్ని **మూలమంత్రము** అంటారు. ఈ విషయమంతా లలితా సహస్రంలోని...

88. ""మూలమంత్రాత్మికా. 89 మూలకూటత్రయ కలేబరా" నామాలలో వివరించారు.

దుర్వాసమహర్షి తన **దేవీ మహిమ్నస్తుతిలోని** 14వ శ్లోకంలో పంచదశీ మహామంత్రం యొక్క గొప్పదనాన్ని ఈ విధంగా చెప్పాడు.

**ఇత్థం త్రీణ్యపి మూలవాగ్భవ మహా శ్రీకామరాజ స్ఫుర**
**చ్ఛక్త్యా ఖ్యాని చతఃశ్రుతి ప్రకటితా న్యుత్కృష్టకూటానితే**
**భూతర్తుశృతి సంఖ్య వర్ణవిదితా న్యారక్తకాంతే, శివే**
**యోజానాతి స ఏవ సర్వజగతాం సృష్టి స్థితి ధ్వంసకృత్ ॥**

అరుణారుణ కాంతులతో ప్రకాశించే ఓ పరమేశ్వరీ । వాగ్భవ, కామరాజ, శక్తికూటములు గలది, నాలుగు వేదాలయందు ప్రతిపాదించబడినది అయిన పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించే వాడు సర్వజగత్కర్త అంటే సాక్షాత్తు పరమేశ్వరుడే అవుతాడు.

పంచదశీ మహామంత్రము సామాన్యమైనది కాదు. గొప్ప మహిమగలది. ఈ మంత్రాన్ని జపించాలంటే పూర్వజన్మలో చేసిన సుకృతం ఉండి తీరాలి. సౌందర్యలహరిలోని మొదటి శ్లోకంలో చెప్పినట్లుగా

**ప్రణతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి** అన్నారు. లలితా త్రిశతి ఫలశృతిలో చెప్పినట్లుగా

**యస్యనో పశ్చిమంజన్మ యదివా శంకర స్వయం**
**తేనైవ లభ్యతేవిద్యా శ్రీమత్పంచదశాక్షరి ॥**

పంచదశీ మహామంత్రాన్ని ఉపాసించాలంటే అతడికి మరుజన్మ లేకుండా ఉండాలి. లేదా సాక్షాత్తు అతడే పరమేశ్వరుడు కావాలి.

అందుకే పంచదశీ మహామంత్రము జ్ఞానప్రదము, మోక్షకారకము అని చెప్పబడుతోంది. లౌకికంగా చూసినట్లైతే ఇది

**ఆయుష్కరం పుష్టికరం పుత్రదం వశ్యకారకమ్**
**విద్యాప్రదం కీర్తికరం సుకవిత్వ ప్రదాయకమ్**
**సర్వసంపత్ప్రదం సర్వభోగదం సర్వసౌఖ్యదమ్**
**సర్వాభీష్టప్రదంచైవ శ్రీవిద్యాపఠనం భవేత్ ॥**

పంచదశీ మంత్రోపాసన వల్ల ఆయురారోగ్య ఐశ్వర్యాలు, ధనధాన్యాలు, విద్య, కీర్తిప్రతిష్ఠలు, కవిత్వం, సర్వసంపదలు భోగభాగ్యాలు, ఒకటేమిటి? అన్ని కోరికలు తీరతాయి.

**ఉపాసకులు:** పంచదశీ మహామంత్రము చాలా గొప్పది. మానవుడికి కావలసిన కోరికలన్నీ తీరుస్తుంది. ముక్తిప్రదం కూడా. అన్నారు కదా ! మరి ఈ మంత్రాన్ని ఉపాసించిన వాళ్ళు ఎవరైనా ఉన్నారా? అంటే పూర్వకాలంలో ఈ మంత్రాన్ని అనేకమంది ఉపాసించి తరించారు. వాళ్ళలో...

**మనుశ్చంద్ర కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః**
**అగస్తి నంది సూర్యశ్చ ఇంద్రో విష్ణు శ్శివస్తథా**
**క్రోధభట్టారకో దేవ్యా ఏతేముఖ్య ఉపాసకాః**

1. మనువు
2. చంద్రుడు
3. కుబేరుడు
4. లోపాముద్ర
5. మన్మథుడు
6. అగస్త్యుడు
7. నందీశ్వరుడు
8. సూర్యుడు
9. ఇంద్రుడు
10. విష్ణువు
11. శివుడు
12. దుర్వాసుడు

ఈ పన్నెండు మంది ముఖ్యులు. మానసోల్లాసము, జ్ఞానార్ణవ తంత్రము వంటి గ్రంథాలలో కూడా వీరిపేర్లు ప్రముఖంగా చెబుతూ బలరాముడు, దత్తాత్రేయుడు అగ్నిదేవుడు కూడా శ్రీవిద్యోపాసకులే అన్నారు.

**ఋషి:** మంత్రాన్ని దర్శించిన వాడు ద్రష్ట. సృష్టించిన వాడు స్రష్ట. ఈ మంత్రాన్ని దర్శించి, ఉపాసించి ఈ లోకానికి తెచ్చిన వాడు మన్మథుడు. కాబట్టి అతడే ఈ మంత్రానికి ఋషి అంటారు కొందరు. కాగా దక్షిణామూర్తి ఋషి అని కొందరు, హయగ్రీవుడు, ఆనందభైరవుడు ఋషులని మరికొందరు చెబుతున్నారు. ఈ ఋషిని బట్టే సంప్రదాయం మారుతుంది. ఇంకా మనకు తెలియని వారు అనేకమంది ఋషులు ఉండచ్చు. అనేక సంప్రదాయాలుండవచ్చు. **ఏ సంప్రదాయాన్నీ చులకనగా చూడవద్దు.** ఎవరినీ అవమానించద్దు. ఇన్ని సంప్రదాయాలున్నప్పుడు మనం ఏ సంప్రదాయం పాటించాలి? అంటే – **గురుసంప్రదాయాన్నే పాటించండి.**

**ఆచారాలు :**

శ్రీవిద్యా సంప్రదాయంలో యతీశ్వరులకు, గృహస్థులకు కలిపి పది గురు పరంపరలున్నాయి. అవి

1. గిరి
2. సాగర
3. భారతి
4. పురి
5. అరణ్య
6. తీర్థ
7. ఆనంద
8. నాథ
9. సరస్వతి
10. ఆశ్రమ

వీరందరి ఆచార వ్యవహారాల్లో తేడాలుంటాయి. వీరు కాక ఇంకా అనేక రకాలైన ప్రసిద్ధమైన ఆచారాలున్నాయి.

1. కౌళాచారులు – వీరు 'ఆధారచక్రాన్ని' పూజిస్తారు.
2. క్షపణికులు – 'స్త్రీ యోనిని' పూజిస్తారు. పూర్వాది తంత్రాలు వీరికి ప్రమాణము.
3. కాపాలికులు – 'పంచామృత తంత్రము' వీరికి ప్రామాణికము
4. దిగంబరులు – రూపభేదము, భూతోడ్డారము, కులాసారము కులోడ్డీశము, కులచూడామణి, సర్వజ్ఞానోత్తరము, మహాకాళిమతము, అరుణేశము, మోదినీశము మొదలైన తంత్రాలు వీరికి ప్రామాణికాలు.

5. ఇతిహాసులు - 'భైరవయామళము' వీరికి ప్రామాణికము

6. వామాచారులు - 'వామకేశ్వరతంత్రము' వీరికి ప్రామాణికము

7. సమయాచారులు- వీరు బ్రహ్మావాదులు. శుభాగపంచకము వీరికి ప్రామాణికము.

వీరిలో కొందరు భగవంతుడికి జంతుబలులు, నరబలులు కూడా ఇస్తారు. స్మశానభైరవి, ప్రత్యంగిర, ఛిన్నమస్త వంటి ఉగ్రదేవతలను అర్చిస్తారు. ఐహిక వాంఛలే వీరి పరమావధి. మొత్తం మీద ఉపాసకులందరూ ఏదో ఒక రకంగా ఐహికవాంఛలలో కూరుకు పోతున్నారు. వీరిని రక్షించటానికి పార్వతీదేవి యొక్క కోరిక మీద ఈశ్వరుడు శ్రీవిద్యాతంత్రము అనే క్రొత్త తంత్రాన్ని చెప్పాడు.

శాక్తేయంలో కౌళాచారులకు - అరవై నాలుగు

మిశ్రమాచారులకు - ఎనిమిది తంత్రాలున్నాయి. కాగా

సమయాచారులకు - ఐదు తంత్రాలున్నాయి. వాటినే **శుభాగపంచకము** అంటారు. అవి 1.సనక 2.సనందన 3.సనత్కుమార 4.సనత్సుజాత 5.వసిష్ట సంహితలు. మొత్తం మీద ఉపాసకులను, వారు పాటించే ఆచార వ్యవహారాలను బట్టి నాలుగు రకాలుగా చెబుతారు.

1. కౌళాచారులు - వీరు అర్ధకామాలకే ప్రాధాన్యత ఇస్తారు.

కౌళాచారులు రెండు రకాలు 1. పూర్వకౌళులు 2. ఉత్తరకౌళులు. వీరిలో

**1. పూర్వకౌళులు** శ్రీచక్రాన్ని గీసి, అందులోని త్రికోణాన్ని పూజిస్తారు.

**2. ఉత్తర కౌళులు** స్త్రీ యొక్క ప్రత్యక్షయోనిని పూజిస్తారు.

**2. సమయాచారులు** - వీరు పూర్తిగా బ్రహ్మావాదులు. శివశక్తులకు భేదం లేదని నమ్ముతారు. మోక్షమే వీరి లక్ష్యము.

**3. మిశ్రమాచారులు** - వీరు కౌళ సమయాచారాలు రెండింటినీ నమ్ముతారు. ఇటు లౌకిక జీవితాన్ని వెళ్ళబుచ్చుతూనే మోక్షం గురించి ఆలోచిస్తారు.

**4. వామాచారులు** - వీరికి వామకేశ్వరతంత్రము ప్రామాణికము. పరమేశ్వరి పూజలో మకార పంచకాన్ని తప్పనిసరిగా వాడతారు. మకార పంచకము అంటే

**మద్యం మాంసం తథామత్స్యం ముద్రా మైధునమేవ చ**
**శక్తి పూజావిధానాద్యైః పంచతత్త్వ ప్రకీర్తితః ॥**

1. మద్యము 2. మాంసము 3. మత్స్యము 4. ముద్ర 5. మైధునాలు. **జ్ఞానార్ణవము** వంటి తంత్రాలు మకారపంచకం వాడటాన్ని పూర్తిగా ఖండించాయి.

పంచదశీ మహామంత్రానికి దక్షిణామూర్తి, హయగ్రీవుడు వంటి ఋషులున్నారని చెప్పుకున్నాం కదా. వారి ఆచారాలు సంప్రదాయాలు వేరువేరుగా ఉంటాయి.

**గురుర్ దక్షిణామూర్తి దక్షిణాచార ప్రవర్తకః**
**హయగ్రీవ స్తదాచైవం వామేచ ఆనంద భైరవ ॥**

| | | |
|---|---|---|
| దక్షిణామూర్తి | – | దక్షిచార (వైదికాచార) సంపన్నుడు |
| హయగ్రీవుడు | – | దక్షిణాచార సంపన్నుడు |
| ఆనందభైరవుడు | – | వామాచార సంపన్నుడు |

ఈ రకంగా శ్రీవిద్యలో కూడా భిన్నమైన సంప్రదాయాలు, ఆచారాలు ఉన్నాయి. ప్రస్తుతము మనం చూడబోతున్న **నాభీవిద్య**కు ఋషి ఆనందభైరవుడు. కాబట్టి ఈ విద్య వామాచార సంప్రదాయానికి సంబంధించినది అనుకోవచ్చు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. "మనం వైదికాచారులం కదా? అలాంటప్పుడు వామాచార సంప్రదాయంలోని 'నాభీవిద్య'ను మనం ఉపాసించవచ్చా?" అని. దీనికి సమాధానం ఏమంటే, మనసంప్రదాయాన్ని మనం పాటిస్తూ, ఇతర సంప్రదాయాల్లో ఉన్న మంచి విషయాలు, గొప్ప విషయాలను మనం స్వీకరించవచ్చు. ఈ విషయాన్ని వ్యాసమహర్షి తన బ్రహ్మసూత్రాలలో అంగీకరించాడు. దీనికి అనుగుణంగానే వామకేశ్వర తంత్రంలోని ఖడ్గమాలను మనం తీసుకున్నాం. అలాగే 'నాభీవిద్య'కూడా.

**హాది, కాది, సాది విద్యలు :**

అకారము నుంచి క్ష కారము వరకు గల వర్ణసమామ్నాయాన్నే అక్షరములు అంటారు. అక్షరము అంటే క్షరము కానిది, నాశనము లేనిది. ఈ అక్షర సమామ్నాయము రెండు రకాలుగా ఉన్నది.

**నృత్తావసానే నటరాజరాజో ననాధ ఢక్కాం నవపంచవారమ్** శివుడు తాండవం చేస్తున్న సమయంలో, సనకాది సిద్ధులను ఉద్ధరించాలనే కోరికతో తన ఢక్కను పద్నాలుగుసార్లు మ్రోగించాడు. అప్పుడు వచ్చిన శబ్దము పాణినిమహర్షికి అక్షర

సమామ్నాయంగా వినిపించింది. ఈ సమామ్నాయము పధ్నాలుగు సూత్రాలుగా ఉంది. వీటి ఆధారంగానే పాణిని **'అష్టాధ్యాయి'** అనే వ్యాకరణ గ్రంథం వ్రాశాడు. దీని ప్రకారం 'అ' నుంచి 'చ' వరకు అచ్చులు. 'హ' నుంచి 'ల' వరకు హల్లులు. అంటే అచ్చులు అకారంతోను, హల్లులు హకారంతోను మొదలవుతాయి. కాగా శబరవర్మ అనే పండితుడు శాబరతంత్రాన్ని వ్రాస్తూ 'అ' నుంచి 'అః' వరకు అచ్చులు, 'క' నుంచి 'క్ష' వరకు హల్లులు అన్నాడు. వీరిద్దరి మధ్య తేడా ఏమంటే పాణిని ప్రకారం హల్లులు హకారంతో మొదలైతే, శబరవర్మ ప్రకారం హల్లులు కకారంతో మొదలవుతాయి. అచ్చులు మాత్రం అకారంతో మొదలవుతాయనే ఇద్దరూ చెప్పారు.

**హల్లులు హకారంతో మొదలైతే హాదివిద్య అని,**
**కకారంతో మొదలైతే కాదివిద్య అని అన్నారు.**

అలాగే పంచదశి మహామంత్రము 'క' కారంతో మొదలైతే కాదివిద్య, 'హ' కారంతో మొదలైతే హాదివిద్య అన్నారు. హాదివిద్యలో యమనియమాలు బాగా ఉంటాయి. కాగా కాదివిద్యలో అవి చాలా తక్కువ. కర్మాచరణ విషయంలో స్వేచ్ఛ ఉంటుంది.

పంచదశీ మహామంత్రాన్ని పూర్వకాలంలో అనేకమంది ఉపాసించి తరించారు అని గతంలో మనం చెప్పుకున్నాం. వారిలో కొంతమంది కాదివిద్యగాను, కొంతమంది హాదివిద్యగాను ఈ మంత్రాన్ని ఉపాసించారు. ఇక్కడ ఎవరి మంత్రం వారిదే.

**తేషుద్వా మనురాజౌతు వరిష్టా వింధ్య మర్దనః**
**లోపాముద్రా కామరాజా ఇతిఖ్యాతి ముపాగతా ।**
**హాదిస్తు లోపాముద్రాస్యా కామరాజాస్తు కాదికః**
**తయోస్తు కామరాజోయం సిద్ధిదో భక్తి శాలినః ॥**

ఈ మంత్రాలన్నింటిలోను, హాదిమతంలో లోపాముద్ర కాదిమతంలో కామరాజ మంత్రము శ్రేష్ఠమైనవి. ఈ రెండింటిలోను చూస్తే కామరాజ మంత్రమే ప్రశస్తమైనది అంటున్నారు మంత్రవేత్తలు.

ఈ మంత్రాలలో కాదివిద్యకు దక్షిణామూర్తి ఋషి అని, హాదివిద్యకు హయగ్రీవుడు ఋషి అని, చెబుతుంటారు. కాని గ్రంథాలలో మాత్రం అన్ని మంత్రాలకు దక్షిణామూర్తినే ఋషిగా చెప్పటం జరిగింది.

శ్రీవిద్యలో కాదివిద్యను మొదటగా పరమేశ్వరుడు పార్వతీదేవికి ఉపదేశం చేశాడు. కొంతకాలం పాటు పార్వతీదేవి ఈ విద్యను ఉపాసించి తరువాత బ్రహ్మ సరస్వతులకు, వారు లక్ష్మీనారాయణులకు, వారు శివపార్వతులకు ఉపదేశించారు. వారి నుంచి ఇంద్రాది దేవతలకు, తరువాత సనక సనందనాది సిద్ధులకు, వారి నుంచి వసిష్టుడు, వ్యాసుడు, గౌడపాదుడు, శంకరుడు మొదలైన వారి ద్వారా గురుపరంపరగా మనకు వచ్చింది. ఇది ఒక సంప్రదాయం.

అయితే సంప్రదాయాన్నిబట్టి విద్యకు మూలపురుషులు మారుతుంటారు. ఇంకొక సంప్రదాయం ప్రకారం –

నారాయణం, పద్మభువం, వశిష్టం, శక్తిం, తత్పుత్రంపరాశరం, వ్యాసం, శుకం ఆ తరువాత గురుపరంపరగా మనకు వచ్చింది. ఇంకొక సంప్రదాయం ప్రకారం శ్రీవిద్యకు మూలపురుషుడు సదాశివుడు. ఇలా సంప్రదాయాలను బట్టి వీరు మారుతుంటారు.

హాదివిద్యలో మిత్రేశమయి, షష్టీశమయి, ఉడ్డీశమయి అంటూ ఖడ్గమాలలో చెప్పారు.

ఏది ఏమైనా **మంత్రశాస్త్రం అంతా ఈశ్వర ప్రోక్తమే.**

పంచదశీ మహామంత్రము అంటే పదిహేను అక్షరాల మంత్రము అని వేరుగా చెప్పనవసరం లేదు. కాని వివిధ మంత్రాలు చూసినప్పుడు, వాటిలోని అక్షరాలు పదిహేను కన్న ఎక్కువ ఉంటాయి. ఇప్పుడు హాది, కాది విద్యలలో చెప్పిన వివిధ రకాలైన పంచదశీ మహామంత్రాలను చూద్దాం. ఇక్కడ ఒక విషయం గమనించండి. సాదివిద్య అని ఇంకొకటున్నది. అందులో మంత్రాలు సకారంతో మొదలవుతాయి. ముందుగా 'కాదివిద్య'లో మంత్రాలను చూద్దాం. మొత్తం పన్నెండు మంది ఉపాసకులు అన్నాం కదా. వారిలో **ఐదుగురు 'కాదివిద్య'**ను ఉపాసించగా, **ఐదుగురు 'హాదివిద్య'**ను, **ఇద్దరు 'సాదివిద్య'**ను ఉపాసించారు.

పంచదశీ మహామంత్రాన్ని ఈ లోకంలోకి తెచ్చినవాడు మన్మథుడు. అయినప్పటికీ ఈ మంత్రాన్ని ఉపాసించి తరించినవారు చాలామంది ఉన్నారు. వారిలో మనువు, చంద్రుడు, కుబేరుడు, అగస్త్యుడు, లోపాముద్ర మొదలైన వారు ముఖ్యులు. అయితే...

1. మనువు 2. చంద్రుడు 3. కుబేరుడు 4. లోపాముద్ర 5. మన్మథుడు 6. అగస్త్యుడు 7. నందికేశ్వరుడు 8. సూర్యుడు 9. ఇంద్రుడు 10. విష్ణువు 11. శివుడు 12. దుర్వాసుడు. వీరందరూ ఉపాసించిన మంత్రానికి దక్షిణామూర్తే ఋషి. కాని మంత్రం మాత్రం వేరుగా ఉంటుంది. వీటన్నింటికీ సకుంకుమవిలేపనా... స్మరేదంబికాం. అనేదే ధ్యాన శ్లోకము. ఈ మంత్రాలు సాధన గ్రంథమండలి, తెనాలి, వారి **ఆమ్నాయమందారము**లో ఉన్నాయి.

**కాదివిద్య :** వీరిలో కాదివిద్య నుపాసించిన వారు ఐదుగురు. 1. మనువు 2. మన్మథుడు 3. ఇంద్రుడు 4. దుర్వాసుడు 5. కుబేరుడు. వీరు ఉపాసించిన మంత్రాలు చూడండి.

**1) మనువిద్యా :** ఇది మనువు ఉపాసించిన మంత్రము. ఇందులో 16 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ మను విద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। అనుష్టుప్ఛందః। మనువిద్యాంబాదేవతా క హ ఏ ఈ ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః। సకల హ్రీం కీలకం। జపే వినియోగః।

క హ ఏ ఈ ల హ్రీం - అంగుష్టాభ్యాం నమః

హ స క హ ల హ్రీం - తర్జనీభ్యాం నమః

స క ల హ్రీం - మధ్యమాభ్యాం నమః

క హ ఏ ఈ ల హ్రీం - అనామికాభ్యాం నమః

హ స క హ ల హ్రీం - కనిష్టికాభ్యాం నమః

స క ల హ్రీం - కరతలకరపృష్టాభ్యాం నమః

ఈ విధంగానే హృదయన్యాసము

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం॥**

**మంత్రము :** క హ ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం।

**2. మన్మథ విద్యా :** ఇది మన్మథుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 15 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ మన్మథ విద్యాంబా మహామంత్రస్య । దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛంద్రః । శ్రీ మన్మథ విద్యాంబా దేవతా । క ఏ ఈ ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । స క ల హ్రీం కీలకం । జపే వినియోగః । కూటత్రయముతో అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।

**3) ఇంద్ర విద్యా :** ఇది ఇంద్రుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 15 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ ఇంద్రవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛంద్రః। శ్రీ ఇంద్రవిద్యాంబా దేవతా। క ఏ ఈ ల హ్రీం బీజం। హ స క హ ల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం । జపే వినియోగః । కూటత్రయముతో రెండు ఆవృతులు న్యాసము.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం।

**4) దుర్వాసవిద్యా :** ఇది దుర్వాసుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 18 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ దుర్వాసవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిశ్ఛంధః । దుర్వాసవిద్యాంబాదేవతా । క ఏ ఈ ల హరీ బీజం । హ స క హ ల హరీ శక్తిః । సకల హరీ కీలకం । జపే వినియోగః ।

కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హరీ । హ స క హ ల హరీ । స క ల హరీ ।

**5) కుబేర విద్యా :** ఇది కుబేరుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 17 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ కుబేరవిద్యాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః। అనుష్టుప్ఛంధః । శ్రీ కుబేర విద్యాంబాదేవతా । క ఏ ఈ ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । సహ సకల హ్రీం కీలకం । జపే వినియోగః ।

కూటత్రయముచే అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** క ఏ ఈ ల హ్రీం । హ స క హ ల హ్రీం । స హ స క ల హ్రీం।

**హాదివిద్య :** వీరిలో హాదివిద్య నుపాసించిన వారు ఐదుగురు. 1) లోపాముద్ర 2) సూర్యుడు 3) అగస్త్యుడు 4) విష్ణువు 5) శంకరుడు. వీరు ఉపాసించిన మంత్రాలు.

**6) లోపాముద్ర విద్యా :** ఇది లోపాముద్ర ఉపాసించిన మంత్రము. ఇందులో 15 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ లోపాముద్రాంబా మహామంత్రస్య దక్షిణామూర్తి ఋషిః । అనుష్టుప్ఛందః । లోపాముద్రావిద్యాంబాదేవతా । హ స క ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । సకల హ్రీం కీలకం । జపే వినియోగః ।

కూటత్రయముతో రెండు ఆవృతులు అంగన్యాస కరన్యాసములు.

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క ల హ్రీం ।

**7) సూర్యవిద్యా :** ఇది సూర్యుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 16 అక్షరాలుంటాయి.

అస్యశ్రీ సూర్యవిద్యాంబా మహామంత్రస్య। దక్షిణామూర్తి ఋషిః। పంక్తిచ్ఛందః। సూర్య విద్యాంబాదేవతా । హ స క ల హ్రీం బీజం । హ స క హ ల హ్రీం శక్తిః । సకహల హ్రీం కీలకం । జపే వినియోగః ।

**ధ్యానమ్ :**

**సకుంకుమవిలేపనా మళిక చుంబి కస్తూరి కాం**
**సమందహసితేక్షణా సచర చాపపాశాంకుశాం ।**
**అశేష జనమోహినీ మరుణ మాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురా జపవిధౌ స్మరే దంబికాం ॥**

**మంత్రము :** హ స క ల హ్రీం । హ స క హ ల హ్రీం । స క హ ల హ్రీం।

**8) అగస్త్య విద్యా :** ఇది అగస్త్యుడు ఉపాసించిన మంత్రము. ఇందులో 19 అక్షరాలుంటాయి.

